# ఆత్మజ్ఞానము - విజ్ఞానము

వినోబా



అనువాదకుడు:
తల్లాప్రగడ ప్రకాశరాయుడు



సర్వసేవాసంఘ ప్రచురణ

ప్రకాశకులు:
డాక్టరు
వెంపటి సూర్యనారాయణ
అఖిలభారత సర్వసేవాసంఘు పక్ష
మున సర్వోదయ సాహిత్య
ప్రచార సమితి, సామ్య
యోగ కార్యాలయము,
తెనాలి.



ప్రథమ ముద్రణ
మార్చి 1961
ప్రతులు 3,000
వెల : 75 న.పై.



ముద్రణ:
పరాశక్తి ప్రెస్, తెనాలి.

ATMAGNANAMU -
VIGNANAMU

*Original :*
**VINOBA**

* * *

First Edition
March: 1961
Copies: 3,000
*Price:* 75 *nP.*

* * *

*Printed at:*
PARASAKTI PRESS, TENALI.

HTA01A213



# ఉపోద్ఘాతము

శ్రీ వినోబా భావే యుపన్యాసములిచట కొన్ని క్రోడీకరింపబడి (ఆంగ్లమున) అనువదింపబడినవి. మానవ జీవిత గతులను గూర్చిన శ్రీ వినోబా యొక్క అమూల్యభావములను మూలగ్రంథమునందు చదువుకొనలేని వారి యుపయోగార్థ మీ యనువాదము చేయబడినది.

భూదాన, గ్రామదానోద్యమ ప్రేరకుడుగ శ్రీ వినోబా మన కింతవరకు సుపరిచితుడై యున్నాడు. తాత్త్విక, మత, సాంఘిక, నైతిక సమస్యలను స్వతంత్రముగ యోచించి తీర్పు చెప్పగల వ్యక్తిగ మన మింకను అతనిని గుర్తింపవలసి యున్నాము. ఇటీవల ఆంగ్లానువాదము చేయబడిన ఆయన 'గీతాప్రవచనములు' అతి గభీరములు ఆ విషయముపై చెప్పబడిన యొక ఉద్గ్రంథము. ఈశోపనిషద్వ్యాఖ్యానము అతని భాషాపాండితిని, సంస్కృత తాత్త్విక సాంప్రదాయసంబంధమగు అతని విశిష్టతను, మహామహులింతకుపూర్వము విహరించిన ఈ క్షేత్రమునందుగూడ శ్రీ వినోబాకున్న స్వతంత్రాలోచనాశక్తిని వెల్లడించుచున్నది.

శ్రీ వినోబా ప్రసంగము లెప్పుడునూ సామాన్య గ్రామీణులకొరకే ఉద్దేశింపబడుచుండును. ఇవియు నట్లే.

చదువులు నేర్చిన పట్నవాసుల కొరకుగాను అతడు తరచుగ ప్రసంగముల నీయడు. ప్రజానీకమున కర్థమగు సామాన్య భాషతో సున్నితములగు భావములను వ్యక్తపరచుటలో శ్రీ వినోబా కున్నశక్తి నిరుపమానము. కనుకనే లక్షలాది భారత గ్రామ ప్రజల నతడు సుశిక్షితులను చేయగలిగినాడు.

ఈ యుపన్యాసములలో తెలుపబడిన ముఖ్య భావము లివి :

1. విజ్ఞానము, ఆత్మజ్ఞానము (ఆత్మజ్ఞానమనగా మతము, ఆత్మజీవనము) ఒకదాని కొకటి అవసరము. ఈ రెంటికలయిక నుండి సర్వోదయ ముత్పన్నమగును.

2. అపూర్వమగు యంత్ర పారిశ్రామికాభివృద్ధికి కారణ భూతమైన విజ్ఞానశాస్త్రము మానవజీవిత వ్యాపారములన్నిటి యందును అహింసనే ముఖ్యసాధనముగ జేసికొనవలసి యున్నది. ఆధునిక విజ్ఞానమునకును హింసకును మైత్రికలిగినచో విజ్ఞాన వినాశమునకు మార్గ మేర్పడును. అట్లుగాక విజ్ఞానము అహింసను సాధనముగ జేసికొన్నచో మానవ సౌభాగ్యము చేకూరును; విజ్ఞానము కూడ నిర్విఘ్నముగ వృద్ధిచెందును.

3. నూతన సాంఘిక వ్యవస్థా నిర్మాణమును, నూతన జీవిత విలువలను ఈ అణుయుగము కోరుచున్నది. "నీ కోరికలను

హద్దులో పెట్టుకొని, నీ భావములను విశ్వవ్యాప్త మొనర్పుము" అనునది శ్రీ వినోబాయొక్క ద్విముఖ సందేశము.

4. విజ్ఞానమువలెనే, మతమును ఆత్మజ్ఞానమును దుస్సాధ్యమై కన్పట్టు బహుదూరపు ఆదర్శమును పెట్టుకొని పనిచేయవలెను; నూతన మత నిర్మాణమునకు గాను శ్రీ వినోబా ప్రతిపాదించు ఈ దూరపు ఆదర్శము 'సామూహిక సమాధి' యనబడును.

5. మానవుడు పూర్ణత్వము నొందుటకు అనంతావకాశములు గలవు. ఈ భావము వి నో బా యుపన్యాసములలో తరుచు వ్యక్తమగుచుండును.

6. విజ్ఞానశాస్త్ర మింకను పూర్ణస్థితినొందలేదు. విజ్ఞానమువలెనే, ఆత్మజ్ఞానమును క్రమ వికాసము నొందవలసియున్నది. విజ్ఞానము, నూతన సాంఘిక వ్యవస్థా నిర్మాణము — ఈ రెండును కలసి మన వేదాంత జ్ఞానమును నిరంతరాభివృద్ధి నొందుచుండును.

7. లోక సేవాదీక్షితుడగు విశ్వమానవుని రూపొందించుటయే భూదాన, గ్రామదానోద్యమ ఆశయము.

8. సమగ్రదృష్టిగల మత మింకను నిర్మాణము కావలసియే యున్నది. ఇక్కడకూడ వి జ్ఞా న ము మన కనుకూలించుచున్నది. మతమునకు పాక్షికదృష్టి యుండరాదు; మరణానం

తర జీవితముపై నది ఆధారపడరాదు; వ్యక్తి యవసరములనే గాక యావత్ సంఘముయొక్క ఆవశ్యకతలను గూడ అది గుర్తింపవలెను.

9. విజ్ఞానయుగమునందు సత్యాగ్రహము శక్తివంతము కావలెనన్నచో, మనస్సును హృదయమును మార్చుటకు చేయబడు అభ్యర్థనము చాలదు. సత్యాగ్రహియైనవాడు మనోహృదయముల కతీతమగు ఒక సూక్ష్మజ్ఞానశక్తిపై ఆధారపడుచు, దానిని బాగుగ నలవరచుకొనవలెను. అరవిందుని మతమునకును గాంధీ తత్వమునకు మధ్య నేర్పడిన ఈ యవధిపై నొక వంతెన కట్టి శ్రీ వినోబా రెంటిని కలిపివేయుచున్నాడు.

అనన్య సులభమగు శ్రీ వినోబా మాటలే ఇందలి విషయములలోని యాథార్థ్యమును పూర్తిగ నిరూపింపగలవు.

—జె. యన్. మహంతి.

# విషయసూచిక

# 1. ఆత్మజ్ఞాన, ప్రకృతి విజ్ఞానముల సంయోగము

పురాతనమునుండియు భారతదేశమునం దొకవిధమగు విచారధార ప్రబలమై యుండుచున్నది. ఆంగ్లేయుల రాకతో నొక నూతన విచార విధానము బయలుదేరినది. ఈ ప్రాత క్రొత్తల నడుమ సంఘర్షణ సంభవించినది. ఈ రాపిడి కొంత బాధకు కారణమైనను, దానినుండి కొంత యుపకారము కూడ జరిగినది.

పూర్వ ఋషుల నీనాటి ఋషులతో పోల్చి చూచినచో, విషయము విస్పష్టము కాగలదు. గుజరాతులో పూర్వము నరసీమెహతాయు, ఈ కాలములో మహాత్మా గాంధీయు ప్రభవిల్లినారు. నరసీమెహతా గొప్ప ఆధ్యాత్మిక వ్యక్తి; గాంధీజీ ఆత్మవిచారణతో ప్రకృతి విజ్ఞానమును మేళవించినాడు. గాంధీజీలో ఈరెంటి కలయికకు కారణము ఆంగ్ల భాషయు, ఆంగ్లేయులతో కలిగిన సంపర్కమును. రెండవ యుదాహరణ బంగాళమునుండి తీసికొందము. మహాభక్తుడగు బంగాళా ఋషి చైతన్యుడు యావద్భారతమున సుప్రసిద్ధుడు. మన కాలములో బంగాళమున వివేకానందుడు, శ్రీ అరవిందుడు ప్రభవించినారు. చైతన్యుడు మహావ్యక్తి; శ్రీ అరవిందుడును అట్లే. కాని వారి మార్గములలో భేదమున్నది. భేదములెంచుట నాయుద్దేశము కాదు. వారివి వేర్వేరు మానసిక తత్వములనుకొన్న చాలును. ఇరువురును మహామహులే. అయితే, అరవింద వివేకానందుల ఆధ్యాత్మిక తత్త్వము ప్రకృతి విజ్ఞానముతో మిళితమైయున్నది. వేరొక యుదా

హారణ కర్నాటకమునుండి తీసికొందము. కుమారవ్యాసుని మానసిక తత్త్వము వేరు, పుట్టపుది వేరు. ఇరువురును పూర్వుల జ్ఞాన సంపదను ఉపయోగించుకొన్నవారే. ఒకరు మహాభారతమును, రెండవవారు రామాయణమును గూర్చి వ్రాసినారు. కాని ఈ రామాయణములో ఆధ్యాత్మిక తత్త్వము, ప్రకృతి విజ్ఞాన దృష్టి సమ్మిళితమైనవి. ఆంగ్లేయుల సంపర్కమిట్లు మనకొక మంచిని చేకూర్చినది. ఆంగ్ల పరిపాలన దుఃఖదారిద్ర్యములకు కారణమైయుండుట నిస్సందేహము. కాని మనకది ప్రస్తుత విషయము కాదు. తద్వారా మనకు లభించిన మంచినే నేనిచట చెప్పదలచితిని. ప్రాచీన ఆధ్యాత్మికజ్ఞానము, నూతన ప్రకృతి విజ్ఞానము—రెండును గ్రామదానమును బలపరచుచున్నవని నా ప్రతిపాదన.

'నేను' 'నాది' యనుట వదలిపెట్టుమని ఆత్మతత్త్వమనును, ఇది వేదాంత బోధ. కొందరీమాటలను పాటించిరి. కొలదిమంది వీని నాచరణలో బెట్టుటకు కూడ యత్నించిరి. ఆత్మోన్నతిని, ముక్తిని బడయదలచిన వారీ మార్గమున వెళ్ళిరి. 'నేను' 'నాది' యను భావన వదలినచో గ్రామములు సుఖవంతము లగుననియే నే ననుచున్నదికూడ. ఇందుచే మనశ్శాంతి, ఆంతరిక సమన్వయము కలుగగలవు. ఆముష్మికమే కాక, ఐహిక సుఖముగూడ చేకూరును. ప్రకృతి విజ్ఞానము, ఆత్మజ్ఞానము, ఈరెంటి నినాదములును భూదానములో కలసి వినవచ్చుచున్నవి. భారతీయ, పాశ్చాత్య సంస్కృతులు రెండును ఇక్కడ కలసినవి. 'నేను' 'నాది' విడువుమని వేదాంతమనును.

గ్రామదాన విషయమున మా ప్రబోధమును అదే. ఇందు కష్ట మేమాత్రమును లేదు. 'గ్రామభూమి గ్రామ మందరిది' అనుడని మిమ్ము మేము కోరునది.

ఇట్లు మన మొక వంతెనను నిర్మించుచున్నామన్న మాట. భూదాన, గ్రామదానములనెడు రెండు కొనలు జీవన నది యొక్క ఇరుపార్శ్వములపై నిలిచియున్నవి. వంతెన రెండు కట్టలను తాకవలెనుకదా! భూదాన, గ్రామదానముల ప్రభావము కూడ జీవితముయొక్క రెండు వైపుల తగులును. అవి మనలను పరమార్థపు దిశకు నడపును. ఇది యాముష్మిక విషయము. ఇందు ఐహిక కార్యము గూడ నెరవేరుచున్నది; కనుక ఈవలిగట్టుతో కూడ దీనికి సంబంధమున్నది. వంతెన ఈవలిగట్టు నుండి ఆవలికి చేర్చునట్లే భూదానము వ్యక్తిగత కార్యసాధన నుండి మనలను విశాలమగు పరమార్థమునకు చేర్చును.

ఇందులకే ఆరు లక్షలమంది భూదానముల నిచ్చినారు. పాశ్చాత్య, భారతీయభావనల కలయిక యిది. రెండు సంస్కృతుల కలయిక మిగుల ప్రయోజనకారియైనది. ప్రసవవేదన దుర్భరమే. కాని నూతన శిశుదర్శనమువలన యానందము కూడ అందుండనే యున్నది. రెండు సంస్కృతుల సంఘర్షణ చాల బాధాకరమే యైనది. కాని సర్వోదయమను సామాజిక అహింసయొక్క నవ్యభావోదయమునకు గూడ అదే కారణమయ్యెను. ఆత్మజ్ఞానమునుండి అహింసాభావన పుట్టినది. సామాజిక దృక్పథము పాశ్చాత్య విజ్ఞానము నుండి పుట్టినది.

ఆత్మజ్ఞాన, ప్రకృతి విజ్ఞానముల సంయోగము సామూహిక అహింసకు ప్రాతిపదిక. వ్యక్తుల అహింసద్వారా మన సమస్య పరిష్కారము కాదు. వ్యక్తులు దానము లిచ్చి, ప్రతిష్ఠకును, స్వర్గమునందు ప్రత్యేక పదవులకును ప్రాకులాడు చుండెడు వారు. కాని మనము తేవలసినది సాంఘిక విప్లవము. మరణానంతరము స్వర్గమునకు పోవుటతో మనకు పనియే లేదు. ఈ పృథ్వీమీదనే స్వర్గరాజ్యము చేకూరగలదు.

సాంఘిక దృష్టిని సూచించు సూక్తులు వేదములలో, ఉపనిషత్తులలో కలవు. మన మిందుకు గర్వించవలసినదే. కాని ఈ భావన మొత్తముమీద పాశ్చాత్యుల నుండియే వచ్చినది. దీనినిబట్టి పూర్వుల వేదాంతము పూర్ణత్వము చెందలేదని తెలుచున్నది. ఇట్లనుట పలువుర కాశ్చర్యము కలిగింపవచ్చును; చాలమంది వేదాంతులకు కోపముకూడ రావచ్చును. వేదాంతము సంపూర్ణశాస్త్రమని యందురు. శంకర, రామానుజాది గొప్ప జ్ఞానధనులు వేదాంతమును సర్వసంపూర్ణమని అనియుండగా, కాదనుట కెవరు సాహసింపగలరు ? వేదాంతుల కోపమే యసంపూర్ణత్వమునకు తార్కాణము. వారికి కోపమే రాకయున్నచో, శాస్త్రము సంపూర్ణమని మన మొప్పుకొనవచ్చునేమో ! ప్రకృతివిజ్ఞానమువలెనే వేదాంతము కూడ క్రమ వికాసము నొందుచుండును. ప్రకృతిశాస్త్రము పరిపూర్ణమని ఆశాస్త్రజ్ఞు డెవడును అనడు. ఈ యనంతసృష్టిలో తాను తెలిసికొన్నది అత్యల్పాంశమని అతడనును. అట్లే వేదాంతమును గూర్చి పూర్ణానుభవమును పొందితిమని మన మనరాదు,

వేదాంతము, అనగా ఆధ్యాత్మిక జ్ఞానముకూడ పూర్ణదశకు రాలేదు. అది క్రమశః సాధింపబడుచు నేయుండును.

భూదాన, గ్రామదానములతో సర్వోదయము పరిసమాప్తి కాదు. మనమిపుడు పెట్టుచున్నది ఒక్క ముందడుగు మాత్రమే. భవిష్యత్తులో నూతన భావములు బయలుదేరుచు నే యుండును. ఇదొక చిరనూతన విధానము. స్వరాజ్య సంపాదనము తరువాతనే సర్వోదయ సందేశము లభించుట మన యదృష్టము. ప్రాచ్య, పాశ్చాత్య మేధాసంపత్తులు రెండును ఇక్కడనే కలియుచున్నవి. నూతన మంత్రములు, నూతన త్యాగవిధానములు ముందు ముందు బయలుదేరగలవు. ముందు తరములవారు మన త్యాగములోని లోటు పాట్లను పట్టి చూపగలరు. అయినను మనము పొందగల్గిన అనుభూతిలోని ఆనందము దానికది సంపూర్ణమే.

శ్రీరంగపట్నము,
22—9—'57



## 2. విజ్ఞానము - అహింస

"విజ్ఞానాభివృద్ధి వలన ప్రపంచమున కేమైన మంచి కలుగునా? ప్రస్తుత రీతిని అది పురోగమించుట వాంచనీయమేనా?" అని కొందరడుగుచుందురు.

ఆధునిక యుగమున మాత్రమే విజ్ఞానశాస్త్రము వృద్ధి చెందుచున్నదనుకొనుట పొరపాటు. పుట్టినదాదిగ మానవుడు

ప్రకృతి పరిశోధకుడుగనే యున్నాడు. నవీనముగ కనిపెట్టబడిన నిస్తంత్రి (వైర్లెస్) ని ఉదాహరణగ తీసికొందము. ప్రకృతి విజ్ఞానమును ముందుకు నడిపిన గొప్ప కల్పనగ మనము దానిని భావించుచున్నాము. కాని దీనిని మించిన ప్రకృతి కల్పనలు ప్రాచీనకాలమున సాధింపబడియుండెను. వాని నాధారముగ జేసికొనియే ఆధునిక ప్రకృతిశాస్త్రము ముందుకు సాగుచున్నది. నిప్పు చేసికొనుట యెట్లో మొదట మానవులకు తెలియకుండెను. ఇది తెలిసిన పిదప మానవ జీవితమునం దెన్నెన్ని మార్పులు వచ్చినవో! కొద్దిదినములు అగ్నిహోత్రము దొరకనిచో ఏమగునో ఊహించుకొనుడు. అన్నము వండుకొనుటే అసంభవము; చలిచే వణికిపోవలసి వచ్చును. అగ్ని సంస్కారము కావలసిన ఔషధములు తయారుకావు. ప్రాచీనకాలపు ప్రజలు రాతి పనిముట్లను, ఆయుధములను వాడెడువారు. ఇనుమెట్టిదో వారెరుగరు. ఇనుము వచ్చిన తరువాత జీవితమునందెట్టి మార్పులు కలిగెనో చూడుడు! ఇనుము వర్జించితిమేని, చాకులు, కుట్టుటకు సూదులు, కర్షకులకు నాగళ్ళు గాని గొడ్డళ్ళుగాని ఉండవు. నవీన యంత్ర నిర్మాణమునకు ఉక్కు చాల ముఖ్యము. ఆదిమానవులకు ఆవును పాలు పిదుకుట యెట్లో తెలియకుండెను. జంతు మాంసముతిని బ్రతికెడువారు. శ్రద్ధతో ఆవును మేపిన మాత్రమున మనకది పాలిచ్చునని మొదట ఎవనికో తోచియుండవలెను. సేద్యము, పశుపోషణ, అగ్ని, వస్త్రముల నేత మొదలగునవి పూర్వుల ప్రకృతి విజ్ఞానమువలన లభించినవే.

క్రమముగ మానవుడు అవిరిశక్తిని కనుగొన్నాడు. సరే, యిప్పుడు అణుశక్తియుగమునకే మనము చేరుకొన్నాము. విద్యుచ్ఛక్తి పశ్చిమదేశములలో చాలకాలముగ ఉపయోగమునందున్నది. ఇండియాలోకూడ త్వరలో దాని యద్భుత క్రియలను చూడగలము. ముందు ముందు కర్మాగారములు అణుశక్తి సహాయమున నడువగలవు. వికేంద్రీకృత గ్రామ పరిశ్రమలుకూడ దాని సహాయముననే నడుపబడవచ్చును. ప్రాచీన కాలమునుండియు ప్రకృతి విజ్ఞానము వేగముగ వృద్ధి చెందుచు వచ్చినది. ఇకముందును దాని నడక అట్లే సాగవలసి యుండును. దానిచే మానవ జీవితము సౌందర్యవంతమగును. మానవుడు జ్ఞాన సంపన్నుడైనకొలది సృష్టి స్వభావమును అధికాధికముగ తెలిసికొనగలడు.

నాకు సులోచనము లున్నవి. వాని నుపయోగింపనిచో నా ముందున్న మనిషిని కూడ (నేను) చూడలేను. విజ్ఞానము యొక్క ప్రయోజన మిట్లు విస్పష్టమగుచున్నది. విజ్ఞానమిట్లు పురోగమించియే తీరవలెను. ఈ శాస్త్రమనిన నాకత్యంత భక్తివిశ్వాసములు. ప్రకృతి విజ్ఞానమునకు రెండు శక్తులున్నవి: ఒకటి నిర్మాణాత్మకము, రెండవది విధ్వంసకారకము. విజ్ఞానము సేవ యొనర్పగలదు, చంపనుగలదు. వండుకొనుటకును, ఇల్లు తగులబెట్టుటకును గూడ అగ్ని పనికివచ్చును. ఈ రెండు పనులను విచక్షణచేయు శక్తి ప్రకృతిశాస్త్రమునకు లేదు. ఆత్మజ్ఞానమునకే అది కలదు. పక్షి రెండు రెక్కలతో నెగురునట్లు, విజ్ఞానము ఆత్మజ్ఞానము అను రెండు శక్తులతో మానవుడు ముందుకు సాగిపోవును. మోటారుబండిలో రెండు రకముల

యంత్రనిర్మాణముండునని మీ రెరిగియుందురు. ఒకటి బండిని నడుపును; మరియొకటి బండిని వలసినవైపునకు మరలించును. ఇందేయొకటి పోయినను బండి పనిచేయదు. మనము పాదములతో నడతుము, కండ్లతో కాదు. కండ్లతో చూతుము. ఆత్మజ్ఞానము కండ్లవంటిది; ప్రకృతి విజ్ఞానము పాదమువంటిది. ఆత్మజ్ఞానము వినా మానవు డంధుడు, అజ్ఞాని. కండ్లుండియు పాదములేనివాడు తన చుట్టును చూడగలడు; కాని కదలిపోలేడు. ప్రకృతివిజ్ఞానము వినా ప్రపంచమున నేపనియు కాదు; ఆత్మజ్ఞానము లేనిదే ప్రకృతి విజ్ఞానమునకు సరియైన త్రోవ కనబడదు.

ప్రకృతి శాస్త్రజ్ఞులు మారణాస్త్రనిర్మాణ మను జ్వరతాపములో పడియున్నారు. ఇంత మేధావులైయుండియు, వారు డబ్బుకు అమ్ముడుపోవుచున్నారు. డబ్బుకోస మేదిచేయమన్నను వారు చేయుదురు. వస్తువు మానవునికి క్షేమకరమా, హానికరమా యనుమాట వారి కక్కర లేదు. డబ్బున కెన్నటికిని అమ్ముడు పోమనియు, మారణాస్త్రనిర్మాణమునకు సహకరింపబోమనియు ప్రతిజ్ఞను వారు చేయగలిగిరా, ప్రపంచరక్షణ కాగలదు. ప్రజానీక మీ సమస్యను చేపట్టువరకు ప్రకృతి శాస్త్రజ్ఞు లీ పనిని చేయ లేరు. ఇట్టి పనులను గర్హించుచు మానవహృదయము రోదించినపుడు ఇదంతయు ఆగిపోవును.

ఒక విషయము గమనింపదగినది: ప్రకృతి పరిశోధన పురోగమించుచుండవలసిన దే. మనము నిరాటంకముగ ముందునకు సాగిపోదలచితిమా, శాస్త్ర పరిశోధనతో అహింసను

జోడింపవలెను. ప్రపంచ క్షేమమున కిది ఏకైక మార్గము. ఈ రెంటి సంయోగము వలననే స్వర్గరాజ్య మీ పృథ్విపై ప్రతిష్ఠింపబడగలదు. అట్లుగాక ప్రకృతివిజ్ఞానము హింసతో చేయికలిపినచో ప్రపంచమునకు సర్వనాశనము తప్పదు. విజ్ఞానాభివృద్ధిని కోరియే అహింసను గూర్చి ఇంతగ నొక్కి చెప్పుచున్నాము. విజ్ఞానాభివృద్ధికి అహింస అత్యావశ్యకము. హింసావిధానమునే సాగించదలచినచో, శాస్త్రపరిశోధనను విరమింపవలెను. పూర్వము రాజ్యకాంక్షచే శత్రువులు భీమ జరాసంధులవలె ఆయుధపాణులై ముఖాముఖి నిలిచి పోరాడెడువారు. అందొకరు చచ్చుట, ఒకరు బ్రతుకుట జరిగెడిదే కాని, తద్వారా ప్రపంచమున కెట్టి నష్టమును వాటిల్లెడిది కాదు. హింస కావలెనన్నచో కర్రలతోనో, చేతులతోనో కొట్టుకొనరాదా ? తుపాకిని కనిపెట్టుట యెందులకు ? శాస్త్రపరిశోధనను హద్దులలో నుంచినచో, హింస సాగినను సాగవచ్చును. అట్టిచో హింసవలన విస్తారము హానిజరుగదు. కాని శాస్త్రపరిశోధన సాగవలెనన్న, దానితో అహింసను కలిపి తీర వలెను. విజ్ఞానము, అహింస-రెంటి సంయోగములో గల విశిష్టత యెట్టిది? జీవిత సమస్యల పరిష్కారమునకు ఆయుధముల నుపయోగపరుపరాదనుటయే అందలి విశేషము. శాంతి మార్గమున నవి పరిష్కరింపబడవలెను. రోగనివారణకుపయోగించు శస్త్రసాధనములనే కాని మారణాస్త్రములను తయారు చేయవద్దని విజ్ఞానశాస్త్రజ్ఞుల నర్థింపవలసి యుండును. ఇట్లు అహింసతో మానవ సమస్యలను తీర్చగలిగితిమా, విజ్ఞాన పరిశోధన మన కుపకరించును. ఇందుకనియే ప్రకృతిశాస్త్ర

మును, హింసయు పరస్పర విరుద్ధములను సత్యమును నేను పదే పదే చెప్పుచుందును. రెండును ఒకచో నిలువజాలవు. ప్రకృతి విజ్ఞానము బ్రతుకవలెననిన, హింసను విసర్జింపవలెను. రెంటిని నిలుప యత్నింతుమేని, మానవజాతితో పాటు ప్రకృతి శాస్త్రముకూడ వినాశమునొందును.

ఈ దృష్టికోణము నుండి భూదానయజ్ఞమును గూర్చి విచారించినచో, మనమొక నూతన దృశ్యమును గందుము. ఈ యుద్యమముద్వారా యావదాసియాఖండ భూసమస్యను పరిష్కరించుటకే మేము చేయు ప్రయత్నము. హింసయే దీనిని పరిష్కరింపవలసివచ్చినచో, మనలో ద్వేషము పెరిగి పోవును. ధాని ఫలితము ఈ ప్రకృతిశాస్త్ర యుగములో అశుభదాయకము. అట్లుగాక ఈ ముఖ్యసమస్యను అహింస తోను, శాంతి ప్రేమలద్వారాను తీర్చుకొనగలిగితిమా, మనలో సహకారభావ మినుమడించును. సమాజము బలయుతము, సుఖవంతము కాగలదు. "మీకెందులకింత వృధా తిరిప్పట ? ప్రభుత్వ మిదంతయు శాసనముద్వారా నెరవేర్చ గలిగియుండగా, ఈ ప్రయాస మీకేల? " అని ప్రజలు నన్నడు గుదురు. అయితే శాసనమూలమున సకరముగ నెంతపని జరుగును ? భూమిని స్వాధీనముచేసికొను శాసనము పుట్టినదను కొందము. భూమిని సదలుట కిష్టపడని రైతును జైలునకంపు దురు. శాసనమునకున్న శక్తి అంతవరకే. శాసనాధికారమన లాఠీ అధికారమే; శాసనమునకండయైనిలుచునది ఆయుధశక్తి యే. ఈబలముమీదనా మన మాధారపడుట ? యోచనీయాం

శమిది : సుముఖత్వ సూచకమగు ప్రజాభిప్రాయము స్థిరపడిన పిదప చేయబడు శాసనము మాత్రమే ప్రజకు శ్రేయోదాయకము. ప్రజల సహకారములేక విధింపబడు శాసనమువలన అసలుద్దేశ్యమే భంగపడును. దానికితోడు మరింత విరోధము నకును హింసకును మార్గమేర్పడును.

రాజశాసనమును, అహింసయు కలిసి పనిచేయవచ్చునందురు. నిజమే. స్వశక్తితో ప్రజలొకపనిని చేసికొనగలుగుట ద్వారా ప్రజాభిప్రాయ మేర్పడును. ఇంకేమైన పని మిగిలియున్నచో, దాని నటుపిమ్మట శాసనము పూర్తిచేయగలదు. కాని ప్రస్తుత విషయములో చిట్టచివర మాత్రమే శాసనము రావలెను. కనుక అహింసద్వారా మనము చేయుచున్న సమస్యాపరిష్కార ప్రయత్నము ఈ విజ్ఞానయుగమునందు మహత్తరశక్తిని ఉత్పన్నము చేయుచున్నదని మనము తెలిసికొనవలెను.

ఒక విషయము ప్రజల కర్థమగుట కష్టమగుచున్నది. "చిన్న పరిశ్రమలను అభిమానించుచు, ప్రకృతిశాస్త్రమును మీరేల ఎదుర్కొనుచున్నారు ?" అని నన్నడుగుచుందురు. విజ్ఞానశాస్త్రమనగా భారీయంత్రముల నెలకొల్పుటయే యనియు, చిన్నయంత్రములతో దానికి సరిపడదనియు వారి నమ్మకము. యంత్రోపయోగముతో విజ్ఞానశాస్త్రమునకు పరిసక్తిలేదు. ఎట్టిస్థితిలో ఏ యంత్రముల నుపయోగించవలెనో, వేని నుపయోగింపరాదో నిర్ధారణచేయునది సాంఘికశాస్త్రము. ఈ విషయముతో విజ్ఞానశాస్త్రమునకు పనిలేదు.

అధిక జనసంఖ్య, తక్కువ పనిపాటలు గలచోట్ల భారీపరిశ్రమలు వర్థిల్లవు. జపాను జనాభా అధికము, భూమి తక్కువ. కనుక చిన్న పరిశ్రమ లక్కడ వృద్ధినొందును. తక్కువజనాభా, ఎక్కువ భూమిగల రష్యా, అమెరికాలవంటి దేశములకు గాను భారీయంత్రము లుద్దేశింపబడినవి. కావలసినంత చిన్న పెద్ద యంత్రసామగ్రిని విజ్ఞానశాస్త్రము తయారుచేసి యివ్వగలదు. భారీయంత్ర నిర్మాణమున కెక్కువ నిపుణతయు, చిన్నవాని నిర్మాణమునకు తక్కువ నిపుణతయు కావలెననుకొనుట పొరపాటు. ఈ చిన్నగడియారమును చూడుడు. దీనిలో తక్కువ విజ్ఞానమున్నదా? చిన్న కుట్టుమిషనులోగాని, ఫొటోగ్రాఫ్ కెమెరాలోగాని తక్కువ నేర్పరితనమున్నదా? పెద్ద చిన్న యంత్రములన్నిటి విషయమునకు విజ్ఞానావశ్యకత కలదు. సాంఘికావసరములను బట్టి ఎట్టి యంత్రము కావలెనో నిర్ణయించుకొన్న పిమ్మట, విజ్ఞానముయొక్క సహాయముతో వానిని తయారుచేయించుకొందుము.

ఈ విజ్ఞాన యుగమున ఇండియాను రక్షింపవలెననిన మనకర్తవ్య మేమి? సాంఘిక సమస్యలన్నిటిని అహింసతో పరిష్కరించుకొనవలెనని గట్టిగ తీర్మానించుకొనుట మొదటి పని. మారణాస్త్ర నిర్మాణమునకుగాక మనుష్యుని కుపయుక్తమగు పనులకే విజ్ఞానము నుపయోగించుకొనుట రెండవ పని. వైజ్ఞానికులు నిర్మించవలసినది భారీయంత్రములా? చిన్నయంత్రములా? అను విషయమును దేశ కాలపరిస్థితులనుబట్టియే నిర్ధా

రణచేసికొనుట మూడవ కర్తవ్యము. వీనిని జ్ఞప్తియందుంచుకొన్నచో, విజ్ఞానము మనకు మహోపకారి కాగలదు. విజ్ఞానాభివృద్ధి నిదానముగను, నిరాటంకముగను సాగిపోవలెనని నా యభీష్టము.

పట్టమరిడి
1—3—'55

## 3. సర్వోదయము — అణుయుగము

మానవు డుద్భవించి లక్షలాది సంవత్సరములైనది. దేశకాలపరిస్థితులనుబట్టి అతని మానసికశక్తు లిప్పటికి బాగుగ వికసించినవని చెప్పుకొనవచ్చును. ఇప్పుడొక మార్పు ఆవశ్యకమని అతడు తలచుచున్నాడు. ఇది సంధికాలము. ప్రకృతి విజ్ఞాన మింతగా వృద్ధిజెందుటచే మానవుని చేతిలోనికి ఏ శక్తియు మిగులబోదనిపించుచున్నది. ఈ స్థితిలో తన జీవితము నెట్లు దిద్దుకొనవలెనో అతడు యోచించుకొనవలసియున్నాడు. అణుయుగము వచ్చిపడినది. సంఘజీవితమున అదికూడ కొన్ని మార్పులు తీసికొనివచ్చినగాని, దాని ప్రయోజనము మన కుండదు. అణుశక్తివలన మానవ సమాజము తుత్తునియలై పతునక కా తునక విడిపోవచ్చును. లేదా, ఆశక్తిని సద్వినియోగమునకు తెచ్చినచో, సమాజము నిస్సందేహముగ అభ్యుదయ మార్గమునుబట్టి బలయుతముకాగలదు. అణుయుగానంతరము గ్రామ పరివారముల (గ్రామసంఘముల) కాలము రానున్నదని, స్థితిగతులను బట్టి నాబుద్ధికి తోచుచున్నది.

మానవునికి విజ్ఞానశాస్త్ర మంతగా తెలియనప్పుడు, కుటుం బము పునాదిగాగల సాంఘికవ్యవస్థను నిర్మించుకొనియుండెను. గ్రామమునుండి వేరై కుటుంబమెట్లు బ్రతుకజాలదో, ప్రపంచ మును విడిచి ఏ చిన్న సంఘముకూడ నిలువజాలదని స్పష్ట మైనది. మానవులలోని అల్పభేదములు అదృశ్యములైనపుడే అణుయుగము నిర్మాణాత్మకము కాగలదు. ప్రపంచజాతుల స్వార్థస్వాతిశయములు నశించవలెను. ప్రపంచమంతయు ఒకే కుటుంబమను అనుభవజ్ఞానము సుస్థిరము కావలెను. ఏ జాతి వారు ఆ జాతి పౌరులమని చెప్పుకొనుచు, స్వజాతి గొప్ప గోడుల నుగ్గడించుకొనుచుండినచో ఈ అణుయుగములో మనకు బ్రతుకే లేదు.

జీవిత ముఖ్యావసరముల విషయమున ప్రతి జాతియు స్వయంపోష్యము కానక్కరలేదని పైమాట కర్థముకాదు. చిన్నచిన్న రాష్ట్రములు, జిల్లాలు, పల్లెగ్రామములు కూడ తగి నంత స్వయంపోషక శక్తిని సంపాదింపగలుగుటయు, అందు లకు వలసిన అణుశక్తి లభించుటయు సుసాధ్యము కావలెను. అణుశక్తి సహాయముతో పల్లెటూళ్ళు స్వయంపోష్యములు కాగలవు. ఈ యణుశక్తివరము కూడ మనకు లభ్యముకా గలదు. కాని అణుశక్తి స్వయంపోషక గ్రామవ్యవస్థల నిర్మా ణమునకు సహాయపడుచునే, మరొక వైపున మన సంకుచిత స్వార్థములను, గర్వములనుకూడ ఎట్లు పెంచి పోషింప గలు గును? మనము ప్రతిగ్రామమును స్వయంపోషకముగ చేసి, ప్రజకు నిజమైన మతధర్మమునుబోధించవలెను. విజ్ఞానశాస్త్ర

మును, అణుశక్తియు మనకు అందనై యుండగలవు. మరియు మనము సమస్త విశ్వమునకును ప్రతినిధులమని భావించు కొనుచు మానవులమను గర్వముతో బ్రతుకవలెను. ప్రతి దేశ ప్రజకు, మిగత దేశము లన్నిటిలోనికిని ప్రవేశముండ వలెను. ప్రతి దేశీయునికిని ప్రతి యితర దేశమునందును పౌర సత్వపు హక్కులుండవలెను. అప్పుడే అణుయుగపు గొప్ప ఫలములన్నియు మనకు దక్కగలవు. రెండు ముఖ్య సత్యము లను మనము గమనింపవలెను: సామాజిక స్వయంపోషకత్వ మును సాధించుట యొకటి; దానితోపాటు దీనజనావళి యెడ లను, యావత్ప్రపంచము యెడలను ప్రేమను పెంపొందించు కొనుట యొకటి. కాని ప్రస్తుత స్థితి ఇందులకు భిన్నముగ నున్నది. చిన్న చిన్న సమాజములకు (అనగా గ్రామములకు) స్వయంపోషక శక్తి లేదు సరికదా, అంతకంతకు పరాధీనత హెచ్చిపోవుచున్నది. నిత్యావసరములకు దూరదేశములపై ఆధారపడుచునే చిన్న చిన్న స్వరాష్ట్ర, స్వభాష, స్వమతా హంకారములలో బడి, మానవసమాజమునే మరచిపోయి నాము. ఈనాడు మన శరీరావసరములకై యావత్ప్రపంచ ముపై ఆధారపడుచున్ననుగూడ, మన చిన్న రాష్ట్రాహంకారము మనలను విడువకున్నది. అసలు కావలసినది ఇందుకు వ్యతిరేక మగు స్థితి: మన జీవితావసరములకు గాను మన సంఘము మీాదనే ఆధారపడుచుండవలెను. మన ప్రేమ, శ్రద్ధ యావ త్ప్రపంచముపై వ్యాపించవలెను. మన భౌతిక జీవితము హద్దు లలో కట్టుబడియుండుచు, మన మానసిక జీవితము వ్యాపకమై యుండవలెను. అమెరికా, ఇంగ్లాండు, జపాను సరకులకొరకు

మనము పరుగిడుచున్నాము. మన పెద్ద పట్టణములలో ఉపయోగార్థము అయిదువందల టన్నుల అమెరికా నెయ్యి ఇండియాలో దిగుచున్నట్లు ఈమధ్య వార్తాపత్రికలలో చదివితిమి. ప్రస్తుత మిదియొక ప్రయోగమనియు, ఇది విజయమొందిన పిదప ఈ నేయి ఇంకను అధికముగ దిగుమతి యగుననియు చెప్పినారు. ఈవిషయమును యోచింపుడు: ఆహారవస్తువులకు మన మమెరికాకు వెళ్ళుచున్నాము. కాని మన ప్రేమాతిశయములు మన దేశము, మన జాతివరకైనను వ్యాపించుట లేదు. "ప్రపంచమును ప్రేమింపుడు; కాని మీ పల్లెలోని నేయినే మీరు తినుడు" అని నేనందును.

మన యుగమును, — ఈ యణుశక్తియు — ఇందుకు చాల అనుకూలముగ నున్నవి. ఇకముందు అణుశక్తి పల్లె గ్రామములను స్వయంపోషకముగ చేయుటకును, ఆధునిక పరిశ్రమల నచట నెలకొల్పుటకును పనికివచ్చును. అణుశక్తి వస్తు నిర్మాణమునకును, వికేంద్రీకరణమునకును గూడ నికమీదట లభ్యము కాగలదు. వస్తూత్పత్తిని వికేంద్రీకృతము చేయుచు, 'ఈ ప్రపంచము మనది, మన మీ ప్రపంచమువారము' అనుకో గలిగినంతగ మన హృదయములను విశాలపరచుదము. అట్లుగాక మన మన్ని దేశముల సామగ్రిని వాడుకొనుచున్నచో, వర్తక వ్యాపారము పెరుగుట నిజమే. కాని తద్వారా వివిధములైన గడ్డుస్థితులేర్పడి, జాతి వైరములకును యుద్ధములకును దారితీయును.

ప్రాపంచిక వస్తువాహనములయెడల మితిలేని వ్యామోహమే మన వినాశమునకు కారణము. ఈవాంఛను అదుపులో

నుంచి, వికేంద్రీకరణసూత్రము నవలంబించితిమా, యుద్ధముల నుండి తప్పించుకొనగలము. మన హృదయములను సంకుచిత పరచుకొనుటద్వారాకూడ యుద్ధములు సంఘటిల్లును. మేము బెంగాలీలమని, గుజరాతీలమని, ఓఢ్రులమని చెప్పుకొనుచుందుము. ఇదెంత సంకుచిత దృష్టి! కనుక మనస్సులను విశాలపరచి, కోరికలను అరికట్టవలెను. వికేంద్రీకృత వస్తూత్పత్తి వలనను, కోరికల తగ్గింపువలనను చాలినన్ని వస్తువులు దొరకవని, సుఖజీవనము జరుగదని పలువురు భయపడుచుండవచ్చును. ఒక్కవిషయము నేను స్పష్టీకరింపదలచినాను. ఈ యణుయుగములో వికేంద్రీకరణము ద్వారా ఎక్కడికక్కడ వలసినంత వస్తూత్పత్తి చేసి, ప్రతివానికిని సుఖజీవనము కల్పించుట సుసాధ్యము. కాని వలసినదానికి మించి కోరుకొనువానిని అణుశక్తియే విధ్వంసము చేయును. కనుకనే ఒక్క కుటుంబముగా కలసి పనులుచేసికొనుచు, భూమియంతయు, సంపదయంతయు గ్రామముత్తపు ఆస్తిగ జేసికొనుమని మేము గ్రామముల నడుగుచున్నాము. జీవితావసరములకై గ్రామమును స్వయంపోష్యముగ చేయవలెను. అణుశక్తి హెచ్చు ఉపయోగములోనికి వచ్చిన కొలది గ్రామసీమలలో అధికాధికముగ వస్తూత్పత్తి జరుగును. దానితో మరింత పురోభివృద్ధియు, సౌభాగ్యమును చేకూరగలవు. ఈ దృక్కోణమునుండి చూచినచో, కోరికల వికేంద్రీకరణమునకును, భావములను విశ్వజనీన మొనర్చుటకును ఈ యుగము అనుకూలముగ నున్నది. అందును భారతీయుల కిది చాల అనుకూల పరిస్థితి.

ఎందువలననగా పై రెండు భావములును భారతీయ సంస్కృతిలో నిమిడియున్నవే.

'నీ కోరికలను తగ్గించి, మనస్సును విశ్వవ్యాప్తము చేయుము'— ఇదియే మన ఋషులు, ద్రష్టలు బోధించిన విషయము. ఈ యాదర్శము నందుకొనుటకు ఇంత యనువగు కాలము మనకుండగా, నిక కష్టమేమున్నది ? మన ఋషి ప్రబోధములను, ఈ యుగధర్మమును ఏకమైనవి. చదువులేని గ్రామబాలునితో "ప్రపంచమానవు లందరు అతని సోదరు"లని చెప్పి చూడుడు. అవునని వెంటనే అతడంగీకరించును. తమ పరిసరములలో తయారగు ఆహారవస్తువుల నుపయోగించవలెనని ప్రజల కర్థమగునట్లు మనము చేయగలిగినచో వారు తృప్తిపడి సుఖింతురు. దీని యర్థము వారికి సులభగ్రాహ్యము.

మన సాంప్రదాయములో నిమిడియున్న పై రెండు సూత్రములపై ఆధారపడితిమేని, మన సుఖ మినుమడించుననియు, ఈ యణుయుగము మనకు సహాయభూతమగుననియు నా యుద్దేశ్యము. కనుకనే విజ్ఞానాభివృద్ధి ఆత్మజ్ఞానమునకు ఆటంకము కాకపోగా మిగుల సహకారియేయని నేను మరల మరల చెప్పుచుందును. విజ్ఞానము మన కుపకరింపవలెనన్న, కోరికలను తగ్గించుకొనవలెను. ఈపని ఆత్మజ్ఞానముద్వారా జరుగవలెను. ఆత్మజ్ఞానము, ప్రకృతి విజ్ఞానము—రెంటికి పరస్పర సహకారమున్నచో మనభూమి స్వర్గముగ మారిపోవును.

తెందకుర
7—5—'55



# 4. ఆత్మజ్ఞానముయొక్క నూతనాదర్శము

మానవుడు ప్రకృతి పరిశోధనలో పురోగమించుచు, ఇతర ఖగోళములకు ప్రయాణము చేయుచున్నాడు. చంద్ర లోకమును, అంగారక గ్రహమును చేరవలెనను ఆవేశ మొక్కటే చాలదతనికి. ప్రకృతి రహస్యములన్నిటిని తెలిసికొని, దాని కధిపతికావలెనని అతని వాంఛ. ఇదిమాత్రము అసంభవము. మానవుడెంత ప్రయత్నించినను, విశ్వములోని శక్తులన్నిటిని లోబరచుకొను టెట్లు సంభవము? అయినను విజ్ఞానశాస్త్రరహస్య మిందేయున్నది. ఆశాస్త్ర మింతకుతక్కువగు లక్ష్యమును పెట్టుకొనజాలదు. మృతులను బ్రతికించుటకును, బాహ్యావస్తు మిశ్రమముతో మానవ శిశువులను సృష్టించుటకును విజ్ఞానము ప్రయత్నించుచునే యుండును. అది నెరవేర్పబూనుకొను అసాధ్యపుపను లిట్టివి. ఇక ఆత్మజ్ఞానమును గూర్చి యేమందుము?

ఇండియా పెట్టుకొన్న ఆత్మజ్ఞానాదర్శము చాల సంకుచితమైనది. మమకారముండరాదు. భ్రమ పనికిరాదు. పాప పుణ్యముల ప్రమేయము వలదు. పరిస్థితు లెట్లున్నను మన శ్శాంతి యొకటుండిన చాలును. ఈ యాదర్శముతో బ్రతుకుచు, ఇతరుల సుఖదుఃఖములతో నెట్టిజోక్యమును పెట్టుకొనని మానవు లీనాటికిని యున్నారు. లోకమింత బాధతో నిండియుండగా మనశ్శాంతి ఎట్లుండగలదు. ఇదంతయు ఈశ్వరుని లీలయందురు. ముక్తి సులభసాధ్యమని వీరి యభిప్రాయము. "ఎంతమాయ, ఎంత అహంకారము మిాచుట్టును

వ్యాపించియున్నది! ఈలాగు మీరు యావత్ప్రపంచమును రక్షింపగలరా? మీరీ కార్యక్రమమును విరమించుట మంచిది" అని యొకసోదరుడు నాకు వ్రాసెను. "మరి నన్నేమిచేయ మందుర"ని నేనంటిని. ఆతని గురువొక స్త్రీ. ఏడుసంవత్సర ముల క్రితము నేనామెను కలసికొంటిని. ఆమె శాంతస్వభా వము కలది, పుణ్యశీల. 'ఆభక్తురాలికి దాసుడవు కమ్మ'ని నా కీమిత్రుడు సలహానిచ్చెను. 'అక్కడ నేనేమిచేయవలె'నని నే నడుగగా, నా ప్రశ్నలో అహంకారమును, అజ్ఞానమును ఉన్న వని చెప్పుచు 'చేయుట కేమున్నది?—మౌనముతో నుండు టయే. అద్వితీయమగు శాంతి మీకు లభించును' అని యత డనెను. ముక్తి అంత దగ్గరలో నున్నదని, తమ కాత్మజ్ఞాన మున్నదని యనుకొను పలువురిట్టివారు ఇండియాలోనున్నారు. ముక్తి తమకు హస్తగతమైయున్నట్లే పలువురు భావించు చున్నను, ఆత్మజ్ఞానము తనకింకను లభ్యముకాలేదని గాంధీజీ యనుచుండెడివాడు. వారికిది సంకుచితదృష్టి. విజ్ఞానశాస్త్రము వలెనే ఆత్మజ్ఞానముకూడ దుర్లభమగు ఆదర్శమునే ముందిడు కొనవలెను. విజ్ఞానము విశ్వాధిపత్యమును సాధింప ప్రయ త్నించునట్లే, మనము ఆంతరిక శక్తులనన్నిటిని లోబరచు కొన యత్నింపవలెను. మానవజాతి యింతవరకు ఆత్మజ్ఞా నముయొక్క అల్పాంశమును మాత్రమే తెలిసికొన్నదని నేను చదివిన మతగ్రంథములను బట్టి నాకు కలిగిన యభిప్రాయము. ఎవనికైన తెలుకుట్టినచో నా కతనియెడల ఇంచుక జాలి మాత్రము కలుగును. జరిగెడిదంతే. నిజమగు ఆత్మజ్ఞానము, అనగా మేమిరువుర మొకటే యను అద్వైతభావన నాలో

నున్నచో, అతడు పొందుచున్న బాధ నాకును కలుగవలెను. శాంతియు, నెమ్మదియు నాయందున్నచో అవి యతనిలోనికి ప్రసరించవలెను. తేలుబాధ నా శరీరములోనికిని, నాలోని శాంతి యానందములు అతనిలోనికి ప్రవేశించవలెను. అంత విశాలమైన ఆత్మజ్ఞానము మనకింకను కలుగలేదు. అందొక అంశము మాత్రమేయున్నది. అందుచే ఆ కొలదిమాత్రపు జాలి మనలో కలుగుచున్నది. మీయోచనకుగాను ఈ భావమును మీ ముందిడుచున్నాను.

ఇక్కడ చేరిన ప్రజలందరును ఒకటయినచో గ్రామదానమున కాటంకమేమికలదు? సంఘమున బయలుదేరు అలజడులు తొలగి, శాంతిస్థాపన కే యాటంకమును ఉండదు. అసలిప్పుడు మన కర్తవ్యమేమి? దీపము తెచ్చినతోడనే చీకటి మటుమాయమగును కదా! కత్తులు కోసికొనుచు అజ్ఞానులు పోరాడుచుండుచోట, ఆత్మజ్ఞాని యొకడు అడుగిడినంతనే పోరాట మాగిపోవును. జరుగవలసినపని యిదియే; నిజమునకట్లే జరుగునుకూడ. కాని మన ఆత్మజ్ఞాన మంత యెత్తునకు పెరిగినట్లు కనబడదు. ఆత్మజ్ఞానముతో సర్వసంపూర్ణత్వము చేకూరినదని వేదాంతుల వాదన. కాని విజ్ఞానశాస్త్ర మట్టి హక్కును నిరూపించుకొనదు. విశ్వప్రకృతిని గూర్చిన సంపూర్ణజ్ఞానము మనకింకను కలుగవలసియే యున్నది. ఈ యాదర్శము అందరానిదని విజ్ఞానవేత్తలకు తెలియును. అయినను దానిని సాధించుటయే వారి యాశయము.

సామూహిక సమాధియొక్క అనుభూతి మానవజాతికి కలుగవలెనని నేను కోరుదును. అసాధ్యమై కనపట్టు ఈ

యాదర్శమును ఆత్మజ్ఞానాన్వేషకుడు తనముందుంచుకొన వలెను. 'రామకృష్ణపరమహంస వ్యక్తిగ పొందిన సమాధిని సామాజికముగ మనము పొందవలె'నని బంగాళములో నతడు సమాధిని పొందినచోట నేను చెప్పియుంటిని. కేవలము అసాధ్యమగు ఆదర్శమే. కాని అట్టి అసాధ్యాదర్శమునుండి నే నెంత యుత్తేజమును పొందుచున్నానో మాటలతో చెప్పలేను. ఈ యాశమాత్రము నాలో శల్యగతమై నిలిచిపోయినది.

ఆర్సికేరి
8—11—'57



## 5. మతముయొక్క పునాదులు

తుదకు మతమే తప్పక జయించునని చెప్పు శ్రీపురందరదాసు కీర్తనను మనము విన్నాము. భారతప్రజలకు మత విశ్వాసమున్న దేశాని, మతము యొక్క విజయము మాత్ర మిందు కనబడదు. మన యందుండిన ఆకొద్దివిశ్వాసమువలననే మనకు స్వాతంత్ర్యము లభించిన మాట నిజమే. మన విశ్వాస మునకు తగినంత విజయమే మనకు కలుగునని కూడ మన మెరిగియుంటిమి. కాని మన దేశములో నిండియున్న దుఃఖము, దారిద్ర్యము, దురదృష్టము మత విజయ సూచకములుకావు. నిజమగు మతమననేమో మనకు బోధపడ కుండుటయే దీని కంతకు హేతువు. ప్రజలకు విశ్వాసమున్నది; వారు దేవతార్చనలు, నైవేద్యములు చేయుదురు. అసలు విశ్వాసము లేకుండుటకంటె ఇదియు కొంతమేలే. మతమునకు పునాది యిది. నిరుపేదలకుకూడ ఈ యనుభూతికలదు. లేకున్న మన

దేశస్థులు అనేక కష్టములపాలై యుండెడువారు. ఎంత దరిద్రు లైనను వారిముఖములలో కళకాంతులున్నవి; వారి కష్టముల బరువంతయు వారి ముఖములలో కనబడదు. వారి విశ్వాసమే దీనికి కారణము. మూలమునందీ విశ్వాసమే యుండియుండ నిచో వారింతకు పూర్వమే సమసిపోయి యుందురు.

కాని యిది పునాది మాత్రమే. మతసౌధ మింకను నిర్మాణము కావలసియున్నది. కేవలము పునాదిపై మాన వుడు జీవింపలేడు. ఒక ఆచ్ఛాదనము అవసరము. విశ్వాస మను పునాదిపై గృహనిర్మాణము అయినప్పుడే ప్రేమతో మన మందు వసింపగలము.

ఈమత మెట్టిది? ఇప్పుడు నిర్మాణము కావలసినదే ఆ మతసౌధము. ఈ మానవ ధర్మము ముస్లిములది, క్రైస్త వులది, హిందూవులదికూడ. ఇట్టి విశ్వ మానవ మతస్థాపనకు ఇతః పూర్వము ప్రయత్నములు జరిగినవి. కాని నిర్మాణము పూర్తికాలేదు. ఇటుక, సున్నము మంచివి కాకపోయెను. తుపాను వర్షము వచ్చి అదికూలిపోయెను. ప్రజ లాగృహ మును వదలిపోయిరి.

ఒక యుదాహరణము నిత్తును. మైసూరు యోగి పుం గవుడు బసవన్న శైవుల మతగురువు. ఒక విశ్వవిశాల మతవ్య వస్థను నెలకొల్పుట కతడు ప్రయత్నించెను. సంఘము నందలి అన్ని వర్గములకు సమానహక్కు లుండవలెనని, కులభేదము నశించవలెనని, ప్రతి వ్యక్తియు కాయకష్టము చేయవలెనని అతడు శాసించెను. అయితే అట్టి మత మింకను వాడుకలోనికి

రాలేదు. బసవన్నయేకాదు, మహా పురుషులనేకులు అదే యుద్దేశముతో కృషిచేసిరి. కాని యిప్పటికింకను అది ఫలించ లేదు. అయినను ఈశ్వరకృపవలన అడుగున పునాది మట్టుకు స్థిరముగ నిలిచియున్నది: కనుక ఈ నిర్మాణ కార్యమును మరల మనము ప్రారంభింతము. ఈ ప్రయత్నము విఫలమగు నని చెప్పి కొందరు మనలను నిరుత్సాహపరచ వచ్చును. వెను కటి కట్టడము వలెనే ఇదిమాత్రము కూలిపోదాయని ప్రశ్నింప వచ్చును. అవును, కూలియే పోవచ్చును; కాని కూలిపోదని యాశింతము. ప్రయత్నము విజయవంతము కాకపోవచ్చును. కాని యొకసారి విజయము చేకూరెనా, దానికిక విచ్ఛిన్నత యుండదు. ఒక యుదాహరణ : పూర్వము మిల్లుబట్టలు లేకుం డెను. కనుక అందరును ఖాదీనే వాడుచుండిరి. మిల్లుబట్టలు వచ్చిన తరువాత ఖాదీ అదృశ్యమయ్యెను. కాని యిపుడు మిల్లుబట్టలు దొరకు చున్నను కొందరు ఖాదీని మాత్రమే వాడుదురు. బాగుగ యోచించు కొనియే వీరిట్లు చేయుచు న్నారు; కనుక వీరి ఖద్దరుధారణ ఆగిపోవునది కాదు. పూర్వ కాలపు ఖద్దరుధారణ అనాలోచితము. ఇప్పుడో, బాగుగ తెలిసి చేయుపని.

ఇట్లే, ఆదికాలమున ప్రకృతి విజ్ఞానములేదు. వట్టి విశ్వాసముమీదనే మత నిర్మాణము చేయబడెను. అవిశ్వా సము ఎదుర్కొనబడినంతనే కట్టడము కూలిపోయెను. యోచ నలేని అంధ విశ్వాసముపై మత మిక మీదట నిలువజాలదు. వివేచననతో కూడిన యెఱుకమీదనే అది నిర్మింపబడ వలెను.

ఉదాహరణకు పురందరదాసు కీర్తన తీసికొందము. తల్లిదండ్రులకు అవిధేయుడైన వాని చర్మము నరకలోకమున ఒలిచివేయబడునట. ఇట్టి బెదరింపులు చాల కలవు. మత మిట్టి పునాదులపై నిలువగలదా? ఆధునిక విజ్ఞానమనెడి తుఫాను వచ్చినది. ప్రత్యక్ష వీక్షణము, ప్రయోగము దాని ముఖ్యసాధనములు. స్వర్గనరకములను రెంటిని అది త్రోసి వేసినది.

మతము పునః ప్రతిష్ఠ చేయబడవలసినచో, వైజ్ఞానిక వివేచనమీదనే అది ఆధారపడవలెను. బిడ్డలు తల్లిదండ్రుల యెడల అవిధేయతచూపిన యేమగును? అవిధేయులైనచో పెద్దల అనుభవజ్ఞానలాభమును వారు పొందలేకపోదురనియు, కనుక తమకు పురోభివృద్ధి కలుగదనియు బిడ్డలకు మనము చెప్పవచ్చును. తల్లిదండ్రుల ప్రేమ తమకు లభించియుండె ననియు, తిరిగి తమ తల్లిదండ్రులను, తదితరులను ప్రేమింపనిచో, ఇతరుల ప్రేమను తాము పొందజాలరనియు బిడ్డలకు చెప్పవచ్చును. విజ్ఞానయుగపు బాలబాలికలు యిట్లడుగుదురు: "స్వతంత్రాలోచనలును, స్వయంనిర్ణయశక్తియు మాకుకలుగు నందాక తల్లిదండ్రులయెడ ప్రేమ విధేయతలు చూపుచుండుట న్యాయము. కాని అటుతరువాత మా కర్తవ్యమేమి?" "మీరు వారిసేవయు చేయవలెను. కాని వారిమాటలు మీ స్వయం నిర్ణయశక్తికి వ్యతిరిక్తములగు పట్ల మీరు విధేయత చూపవలసిన పనిలేదు" అని మనమందుము.

తులసీదాసిట్లన్నాడు: ఎవరు స్వర్గమునకు, మరెవరు నరకమునకు పోవుదురో ఎవరు చెప్పగలరు? కాని తులసి

మాత్రము రాముని విధేయసేవకుడై ఈ ప్రపంచమునందే ఉండిపోవుట కిష్టపడును.

ఆముష్మిక జీవితముపై ఆధారపడి, మతము నిలువజాలదు. మతముయొక్క నగదు విలువలు మనము తేల్చవలెను. మరణానంతరము నోటిని తియ్యబరచు చక్కెర యెవరికి కావలెను? విజ్ఞాన శాస్త్ర సత్యముల కనుగుణమగు ప్రత్యక్ష ఫలితార్థములు కానుపించుచుండవలెను. "ప్రేమ, సహకారములతో జీవింతువేని సుఖింతువు. దుఃఖదారిద్ర్యముల నుండి విమోచనకలుగును. ప్రేమలేనిచోట దౌర్జన్యము పెరుగును. దాని తుదిఫలమగు ఆటమ్‌బాంబులతో ఘోర విపత్తు సంభవించును. గ్రామదానము స్వర్గ సౌభాగ్యపదవి నిత్తునని చెప్పదు; కాని ఇక్కడ, ఈ జన్మలోనే అది మనకద్వితీయమగు ఆనందమును చేకూర్చుట నిశ్చయము"

ఖైసాంద్ర
3—11—'57



# 6. మానవుని మతము

మన దేశమునందును, ప్రపంచమంతటను మతముయొక్క పునాదు లింత కు పూర్వమే వేయబడియుండెనని యంటిని. భగవద్విశ్వాసమే ఈ పునాది. వివిధ సంఘములందు, వివిధ రూపములలో ఆవిశ్వాసము నిలచియున్నది. కాని పునాదిపై కట్టడము, అనగా వ్యక్తికిని సమాజమునకును ఆశ్రయమీయ గల మతమనబడు గృహమింకను నిర్మింపబడలేదు. పునాది

యున్నదే కాని వాసయోగ్యమగు గృహము లేదు. కనుక మతనిర్మాణము కావలసియున్నది. అనేకమతములు పుట్టినను, సరియగు మతధర్మ మిప్పటికిని యేర్పడనప్పుడు, ఆ విషయమున మనమిక చేయగలిగిన దేముండునని ఎవ్వరైన అనవచ్చును. ఏబదిమతము లుండియు అసలు పని నెరవేర్చలేకపోయినవి. మానవజాతి కంతకును మానవుని మతమొక్కటే శరణ్యము. అది యింకను రాలేదు. అందులకై ప్రయత్నములు జరిగినవి. కొంతవరకైనను నవి సఫలమై యుండవలసినది. కాని పూర్తిగ విఫలమైపోయినవి. పునాదిమాత్ర మిప్పటికిని బలముగనున్నది. ప్రజాహృదయములో విశ్వాసము నెలకొనియున్నది. కాని మానవునికి మాన్యతనిచ్చు ధర్మముగా అది యింకను మారలేదు.

ఉదాహరణ మొకటి తీసికొందము. బసవన్నస్వామి చేతిపరిశ్రమలోని నీతిధర్మమును బోధించియుండెను. పెద్ద పిన్నలనక, ప్రతిమనిషియు కాయకష్టము చేయవలెనని బోధించినాడు. ఇది మతధర్మముగ బోధింపబడెను. అయితే ఆ మత మింకను అమలులోనికిరాలేదు. ఈనాటికిని కోట్లాది ప్రజలు శరీరపరిశ్రమ చేయుచునేయున్నారు. ఆరోజులలోకూడ వారా పనిని చేయుచుండిరి. అయితే దీనిని మతధర్మముగ శాసింపవలసిన అగత్యమేమి వచ్చినది? విషయమిది: కాయకష్టమును పూర్వము చేసినవారు, ఇప్పుడు చేయుచున్నవారూ గత్యంతరములేకయే ఇట్లు చేయుచున్నారు—కాయకష్టము గౌరవనీయమను విశ్వాసము వారికుండిగాదు. పనిచేయని వారికి అసలా విశ్వాసమే శూన్యము. కష్టజీవియొక్క ఆశయ

మేమి? కర్షకుడు తాను సేద్యము చేసుకొనుచున్నను, ఆ శ్రమనుండి తప్పించు విద్యనే తన బిడ్డలకు చెప్పించును. తనకు తప్పదు కనుక పనిపాటులు చేసికొనును. ఏమాత్ర మవకాశ మున్నను తన బిడ్డలు శ్రమపడరాదని అతని కోరిక. కనుక కాయకష్టము విధిలేకనే చేయబడుచున్నది. "కాయకష్టము మతధర్మముగ చేయబడుట సరియేకావచ్చును. అయితే ఆ స్థితి యెట్లుకలుగును?" అని కొందరడుగవచ్చును. ఈ జన్మ సంగతి యెట్లున్నను, ముందు జన్మకు లాభదాయకమను ఆశతో మన మందరమును కాయకష్టము చేసిన సరిపోవునా? కాయకష్టపు మతమును అమలులోనికి తెచ్చువిధ మిదియేనా? మిగత అన్ని రకముల పనులకును గల ఆర్థికవిలువ కాయకష్టము నకు గూడ వచ్చినపుడే, అది మతధర్మముగ స్వీకరింపబడ గలదు. అప్పుడే దానికుండవలసిన గౌరవము మరల కలిగి అది మతధర్మమగును. దానివెనుక సంఘబలమొకటుండ వలెను. దానిని బలపరచు సాంఘికవ్యవస్థ నిర్మాణముకావలసి యున్నది. కాయకష్టమువలన ఇహలోకమునందు కలుగు లాభములు ఋజువుకావలెను. ఇహమునందుకాక పరమునందేదో శుభమగుననుట సరిపోదు.

కాలేజి ప్రొఫెసరు నెలకైదువందలు వేతనము తీసికొనును. సంవత్సరములో ఆరునెలలు సెలవులుపోగా ఆరు నెలలు మాత్రమే అతడు పనిచేయును. దినమునకు మూడు గంటలకు మించి అతనికి పనియుండదు. ఏడాది మొత్తమున కతడు పనిచేయుగంటలు ఆరువందలు; ప్రతిఫలము ఆరువేల రూపాయలు; గంటకు పది రూపాయలైనది. కాయకష్టము

చేయు పనివాం(డకు — బసవన్న శిష్యులనుడు — గంటకు రెండణాలకు మించి ముట్టదు. ఇదికాక, కాలేజి అధ్యాపకుడు పాతిక లేక ముప్పది సంవత్సరములు పనిచేసిన పిదప ఉపకార వేతన లాభమును పొందును. కాని యీ కష్టజీవికి బసవన్న శిష్యునకు ఏమున్నది? ఏమియు లేదు. ఇట్టి పునాది మీద మతమెట్లు నిలువగలదు? అందుచేతనే సరియగు మతమింకను పుట్టుక గన లేదని నేను చెప్పుచుందును. హిందూ, మహమ్మదీయ, క్రైస్తవాది మతములన్నియు పునాదులుగనే నిలిచిపోయినవి. తమసౌధ నిర్మాణమింకను కాలేదు.

మరియొక విషయము యోచింతము. చౌర్యము చెడ్డదని మతము బోధించును. ధనసంచయము పాపము కానప్పుడు, దొంగతనమెట్లు పాపమగును? ఇట్టి పక్షపాతపుబోధ పనికిరాదు. ధనసంచయము చేయువాడీ లోకమున గౌరవింపబడుచున్నాడు; పిమ్మట వానికి నరక(పాప్తియే కావచ్చును. కాని దరి(దుడగు కష్టజీవికి ఈ జన్మలో గౌరవము లేకపోయినను, జన్మాంతరమున నతడు స్వర్గముపై స్వర్గమునకు పోవచ్చును. కాని జన్మాంతర విషయములపై మత మాధారపడియుండరాదని మనము (గహించవలెను. ఈ జన్మయొక్క ఆధారమే దానికి కావలసినది. మతము సంపూర్ణమై యుండవలెగాని పాక్షికవ్యాపారము కారాదు. దొంగిలించుట పాపమగుచో ధనసంచయముగూడ పాపమే. ఈరెండు భావములును కలిసి మతధర్మమగును. వ్యక్తికొక మతముండవచ్చును. కాని అది యావత్తు సంఘముయొక్క సమ్మతిని బడయవలెను. సంఘవ్యవస్థ ఆరీతిగ నిర్మాణము కావలెను.

మతము పాక్షిక వ్యవహారము కాకూడదు. అది యందరికిని వర్తింపవలెను. సమాజమునందొక భాగమునకు వర్తించి మరియొక భాగమునకు సంబంధించక యుండరాదు. ఒక యుదాహరణము: పుణ్యస్త్రీకి నుదుట కుంకుమ, కంఠమున మంగళసూత్రము పాతివ్రత్యపు గుర్తులుగ ధరించు విధాయకము. పురుషునికి మాత్రము పత్నీవ్రతము కాదా? అతడును తిలకమెందుకు ధరింపడు? చూచినంతనే వివాహితయైన స్త్రీని గుర్తింపగలిగినట్లు, పెండ్లియైన పురుషులను గుర్తింపలేము. పత్నీవ్రత సూచకముగా పురుషు డెందులకు కంఠమున సూత్రమును ధరింపడు? సమాజమునందొక భాగమునకు మాత్రమే విధులను నిర్ణయించి, మిగతభాగ విషయమై ఏమియు చెప్పని మతము వర్థిల్లదు.

మతముయొక్క మూడు ముఖ్య సూత్రములు సూచించితిని:

(1) ఆముష్మిక జీవితముపై మత మాధారపడరాదు. (2) మతమునకు పూర్ణదృష్టి యుండవలెగాని పాక్షికదృష్టి పనికిరాదు. (3) వ్యక్తిజీవితముతో మతము పూర్తికాదు; సమాజమునే ఆ ప్రకారము తయారు చేయవలెను. అప్పుడే సంఘమొత్తమునందు మతము చిరస్థాయి యగును. పై మూడు షరతులును సఫలమైనప్పుడు మతసౌధము నిర్మాణము కాగలదు. కాని ఈ షరతు లిప్పటి కింకను ఈడేర లేదు. మహాపురుషు లీవిషయమున ప్రయత్నము చేసియున్నను వారందు విజయము పొందలేదు. మనమిక దాని నిర్మాణము

చేయవలసియున్నాము. విజ్ఞానశాస్త్ర సహాకారముతో మన మాపని చేయగలము. మతముయొక్క పునాదులను సుస్థిరము గావింపవలెను. ఎందువల్లననగా, మతమునిలువనియెడల మనకు బ్రతుకే లేదు. విజ్ఞానశాస్త్రము మానవుని మనోబుద్ధులను విశాలపరచినది. అయితే హృదయము సన్నగిలియున్నది. "ఇది నా పొలము, ఇది నా యిల్లు. నా పొరుగురైతు ఏమరి యున్నప్రుడు మూరెడుభూమి వానిది నాపొలములో కలుపు కొనవచ్చు"నని పొలముకాపు కలలు గనుచుండును. మానవు డొకవైపున చంద్రలోకయాత్రను గూర్చి మాటలాడుచు, మరొకవైపున నొక చదరపు అడుగు నేల దురాక్రమణకు ఉపాయము వెదకుచుండును. ఇట్టి పరిస్థితులలో మానవులు బ్రతుక గలరా? ఇదే అసూయకును, కలహములకును, చివరకు యుద్ధములకును కారణమగును. ఇండియాలో మనము ప్రతి గ్రామమునందునూ అన్యోన్యతను పెంపొందించుకొనుచు, సమాజవ్యాప్తమగు మానవుని మతమును ప్రతిష్ఠితుముగాక! అందరమును భగవంతుని సంతానమేయను గట్టి పునాది అప్పుడేర్పడును.

"పూర్వులు సాధింపజాలని కార్యమును మీరు సాధింపవలెనని ఆశించుచున్నారా?" యని ప్రజలడుగుదురు. వారికే నేనిట్లు బదులు చెప్పుదును: "అవును; నాకిపుడు విజ్ఞానశాస్త్ర సహాయమున్నది; పూర్వమది లేదు. విజ్ఞానశాస్త్రము సహాకరించుటమాత్రమే కాదు; అది భయపెట్టుచున్నదికూడ. వివాదము, ఘర్షణ మానవజాతిని విధ్వంసమొనర్తుమని భయపెట్టు

చుండగా, ప్రేమయు సహకారమును స్వర్గరాజ్యము నీ పృథ్విపై ప్రతిష్ఠింపగలమని హామీనిచ్చుచున్నవి."

**స్వర్గనరకములు రెండును ఈ జన్మలోనివే.**

పూర్వీకులు స్వర్గమని నరకమని యనెడువారు. సత్కార్యములవలన స్వర్గమును, స్వార్థపరత్వమువలన నరకమును మరణము తరువాత ప్రాప్తించునని అనుకొనెడువారు. ప్రేమ, సచ్ఛీలము, సహకారము ఎప్పుడో కాక ఈజన్మలోనే స్వర్గమును ప్రసాదింపగలవని విజ్ఞానము తెలుపుచున్నది. విజ్ఞానమిట్లు ఫలితార్థములను సూటిగ కండ్లకు గట్టినట్లు చూపుచున్నది. హిరోషిమాకు సంభవించిన మహావిపత్తు నరకము గాకున్నచో మరి యేది నరకమనదగును ?

కనుక పుణ్యాపాపములను ప్రత్యక్షానుభవమునకు తేగల మతమును మనము ప్రతిష్ఠింపవలసియున్నాము. ఇదే మతసౌధమునకు పునాదికావలెను. ఇందు ఆత్మజ్ఞానము మనకుపకరించగలదు; మహాత్ముల ధర్మసాధనలు కూడ మనకు సహకారులే. ముఖ్యవిశేష మేమనగా విజ్ఞానశాస్త్రము మనతో సహకరించుచున్నది; కనుక మనము చేయవలసిన త్యాగము చాల స్వల్పము, అధికముకాదు.

తుర్వేకరు
4—11—'57



5]

# 7. విశ్వమానవుని ఆవిర్భావము

అసలు మన మెవరమో మొదట తెలిసికొనవలెను. ప్రథమతః నేను కన్నడిగనై, తదుపరి భారతీయుడనై, చిట్టచివరనా మానవుడనగుట? లేక మొదటనే మానవుడను, తరువాత భారతీయుడను, అటుతరువాత కన్నడిగనా? తరువాత కుటుంబస్థుడను, భౌతిక దేహధారిని యనబడుదును—సరే.

విద్యాశాస్త్రమున కిదియే ముఖ్యవిషయము. వెనుక నే నాశ్రమమునం దుపాధ్యాయుడుగ నుంటిని. నివాసము వార్ధాజిల్లాలో. కాని బిడ్డలకు వార్ధాను గూర్చిగాని, మహారాష్ట్రమును గూర్చిగాని చెప్పువాడను కాను. అందరమును భూగోళవాసులమని, ప్రపంచపౌరులమని చెప్పువాడను. ఈ విశ్వ మెంత విశాలము! లక్షలాది ఖగోళరాసులలో సూర్యుడొక గోళము మాత్రమే. ఈ విశ్వముతో పోల్చిన సూర్యుడెంత చిన్నగోళము! అట్టి సూర్యుని చుట్టు తిరుగుచున్నది మన భూమి. ఇందుపై అసంఖ్యాకములగు జీవులున్నవి. విజ్ఞానశాస్త్ర ప్రకార మీ జీవులు 20 లక్షల రకములు. 84 లక్షలని మన ధర్మగ్రంథము లనుచున్నవి. ఏమైనను వానిది లక్షల సంఖ్యకాని, వేల సంఖ్య కాదు. ఇన్నిరకముల జీవుల నెవడు లెక్కింపగలడు? ఈ జాబితాలో మానవుడొక చిన్నభాగము. మానవుడు వసించు దేశములలో ఇండియా యొకటి. ఇండియాలో ఒకభాగము మహారాష్ట్రము; వార్ధా అందొక చిన్న మండలము. ఈ యాశ్రమ మా మండలములోనిది. ఆశ్రమ

మున కిరుపార్శ్వముల రెండు పొలములున్నవి. వాని మధ్య నిలువబడిన నే నెంత ? శుద్ధ శూన్యము.

వేదములలో నొక సూక్తమున్నది. దాని పఠనము వలన పాపపరిహారమగునని యందురు. "ఆదిలో ఋతము, సత్యము ఉండినవి. ఋతమునుండి సూర్య, చంద్ర, నక్షత్రములు సృజింపబడెను" అని యా సూక్తము. సూక్తములోని దింతమాత్రమే యైనచో, దాని పఠనమునకును పాపవిమోచనమునకును సంబంధమేమని ప్రశ్నింపవచ్చును. అనంత విశ్వమును గూర్చిన విశాలభావనను మనకు కలిగించుటయే అందలి విశేషము. ఆ భావనలో మనమెంత అల్పులమో మనకు బోధపడి, మన అహంకారము తగ్గి, పాపచింతల కవకాశము లేకుండ బోవును.

సారాంశమేమనగా, ముఖ్యముగ మనము మానవులమని, తరువాతనే భారతీయులమని, కన్నడులమని గుర్తించుటలో మన జీవితపు విలువలు పూర్తిగ మారిపోవును.

ఈనాటి మానవునియందెన్ని శక్తులున్నవి ! ఇన్ని శక్తులుండియు, అతని మనస్సు సంకుచితమైయున్నది. ఒక ఆంతరిక ఘర్షణలోపడి, అతని మానవత్వము ఛిన్నభిన్నములగుచున్నది. పూర్వకాలమున చక్రవర్తులకుగూడ భూగోళజ్ఞానము లేకుండెను. అక్బరంతటి మహాచక్రవర్తి కుండిన భూగోళజ్ఞానమెంత ? ఆంగ్లేయులిచటికివచ్చి అతని దర్బారును దర్శించినపుడే ఇంగ్లాండు దేశమొకటుండెనని అతనికి తెలియవచ్చెను. నేడు చిన్నబిడ్డలకు సహితము ప్రపంచమును గూర్చిన కొంత

జ్ఞానమున్నది. ఇంత జ్ఞానవైశాల్యముతో హృదయనైచ్యము కలిసియున్నచో జీవితము తుత్తునియలైపోవును. జ్ఞానౌన్నత్యముతో హృదయౌన్నత్యమును జోడింపగలిగినచో మానవుడీ పృథ్విని స్వర్గముగ మార్చగలడు.

గ్రామదానములు మొదలగునవి భూసమస్యను పరిష్కరించుటలో సహాయపడుచుండుట ఒక చిన్న విషయము. మన జ్ఞానము ఉన్నతస్థాయికి పెరుగుచుండుట అందెక్కుడు ముఖ్య విషయము. మనగ్రామ మంతయు ఒక్క కుటుంబముగ మారవలెను. గాలి, నీరు, భూమి ఈశ్వరుడిచ్చిన వరములు; వాని కందరును భాగస్వాములు కావలెను; అందరమును సహకార భావముతో పనిచేయవలెను. నాకొరకు గాక, సమాజ క్షేమము కొరకు నేను పనిచేయుదును; నావిషయమైగాక సంఘ విషయమై యోచింతును. ఈ భావన స్థితిగతులను పూర్తిగ పరివర్తన మొందించును. ఇదియే నన్నీ పనికి పురికొల్పుచున్నది.

క్రొత్తతరహా మానవుని మనము రూపొందించవలసి యున్నాము. ప్రాత తరహా నశించిపోయినది. ఆస్ట్రేలియను స్నేహితుడొకడు నన్ను చూడవచ్చెను. భూదానోద్యమము ప్రపంచము మొత్తమున కేమైన ఉపకరించునా యని అతడు నన్నడిగెను. "ఆస్ట్రేలియాలో పుష్కలముగ భూమియున్నది. జపాను వారికి సరిపడినంత భూవసతి లేదు. కనుక మీరు జపానీయుల నాహ్వానించి మీ దేశమున వారికి నివాసము లేర్పరుచ్చుడు. ప్రపంచము మొత్తమునకు భూదానోద్యమ ప్రాము

ఖ్యాత యిదే"యని నేనంటిని. నామాట కా మిత్రుడు నివ్వెరపడి యిట్లనెను: "మావద్ద కావలసినంత భూమి యున్నది, నిజమే కాని మా సంస్కృతిని మేము సంరక్షించుకొనవలెను. కనుక మా సంస్కృతి కెక్కువ సన్నిహితులగు ఐరోపావారికి మేము స్వాగత మిత్తుము." ఈవిషయమును వెడలగొట్టుటయే భూదానోద్యమోద్దేశము. ఆస్ట్రేలియా, ఐరోపా నాగరికతలనుండి జపాన్ నాగరికతయు, ముస్లిమ్ నాగరికత నుండి హిందూ నాగరికతయు వేరను సంకుచిత భావనలను అతిక్రమించుటయే దాని యుద్దేశ్యము" అని నేను బదులు చెప్పితిని. భూదానము పేరట మేము పెట్టుకొనిన గమ్యము అల్పమైనదికాదు. మానవజీవితమును మార్పుచెందించి, విశ్వమానవుని రూపొందించవలసియున్నాము.

బెంగుళూరు
18—10—'58



## 8. సామూహిక సమాధి

శ్రీ రామానుజాచార్యునికథ అందరెరిగినదే. గురూపదేశముల నందరకు వెల్లడిచేసినందులకు నరకమే వచ్చినను రానిమ్మని చెప్పి, తారకమంత్రమును బహిరంగముగ అతడందరకు బోధించెను. బ్రహ్మజ్ఞానమును రహస్యముగ నుంచవలెనను భావము ఆనాటివరకు వ్యాపకములో నుండెను. అదంతయు తప్పని నేనననను. అందు కొంత సత్యమున్న మాట నిజమే. బ్రహ్మజ్ఞానమును బజారుసరుకుగ చేసినచో దాని విలువ పోవును; కనుక దాని రహస్యమును కాపాడుటలో మాధుర్య

మున్నది. కాని రహస్యమును బయలుపరచుటలో గూడ వేరొక మాధుర్యము కలదు. జ్ఞానదేవుడు, ఏకనాథుడు అట్టి పనినే చేసిరి. రామానుజుడు దేశమంతకును బ్రహ్మవిద్యా కవాటమును తెరచినట్లే, జ్ఞానదేవుడు మహారాష్ట్రమున కదే పనిచేసినాడు......జ్ఞానదేవుడు మహారాష్ట్రమున కొనర్చిన మహత్కార్యమును రామానుజచైతన్యులు దేశమునొత్తమునకు చేసిరి. వారు వెళ్ళినచోటులందెల్ల జ్ఞానబీజములు వెదజల్లుచు, స్త్రీలు బిడ్డలతో సహా సామాన్య ప్రజకు జ్ఞానభిక్ష నొసంగు చుండిరి.

ఈ మహాత్ము లుపదేశించిన ప్రేమమతమును మన మిపుడు మరింత ముందునకు తీసికొనిపోవలెను. వా రుపదేశించిన జ్ఞానమును మనము ప్రజల కందించుచు, దానికి నూతన రూపము నిచ్చి లోకము యెదుట నుంచవలసియున్నాము. ఇట్టి కార్యక్రమ మీ యుగధర్మమున కనుగుణముగ నుండును. వైదిక మతమున కిపుడొక క్రొత్తరూపము నీయవలె.

సర్వోదయమునందు భక్తియొక్క రూపము మారవలెను. సర్వభూతములయెడ సమదృష్టి యికముందు ఉత్తమ భక్తి యనబడదు. ఇది తక్కువరకపు భక్తియగును. సమాధిలోనున్న ఒకానొక వ్యక్తి జీవులన్నియు తనలోడివే యను అనుభూతిని పొందగలడు. భేదములన్నియు కృత్రిమములు కనుక వానిని తీసివేయవలెననును. కాని ఈనాడు యీయను భవము వ్యక్తులకే కాక సమాజమంతకును అవసరమై యున్నది. అనగా, కావలసినది సామూహిక సమాధి. నా

నోట భగవంతుడొక గొప్ప సత్యమును ప్రకటించినాడు. మూడేండ్ల క్రితము బంగాళా పదయాత్రలో శ్రీ రామకృష్ణ పరమహంస మొదట సమాధిస్థితి నొందినచోటు దర్శించితిని. అక్కడ నొక కొలను గట్టున కూర్చుండి, "శ్రీ రామకృష్ణు డిచట వ్యక్తిగా పొందిన సమాధి స్థితికి సామాజిక రూపము రావలసియున్నద"ని యంటిని. జ్ఞానదేవుడు చెప్పినదియు అదే. సమత్వానుభూతి యావన్మందికిని కలుగవలెను.

మానవసమాజమిట్టి యున్నతభక్తికై కృషి చేయవలె, లేదా నశించిపోవలెనన్న పరిస్థితిని విజ్ఞాన మీనాడు తెచ్చి పెట్టినది. 'నాది, నీది' యను భేదమును విడనాడి, ఉన్నతభక్తి సాధనకు పూనుకొనమని ఈ యుగధర్మము కోరుచున్నది. ఇక ముందు * సామ్యయోగము కీర్తనలలో పాడుకొనుటకు మాత్రమే కాదు, నిత్యజీవితములో సూటిగ ప్రత్యక్షానుభవమునకు రావలసిన భావమిది. ఇది విజ్ఞానము చేయు సవాలు. ఈ సవాలే మన పదయాత్రకు ప్రేరణ కలిగించినది.

విజ్ఞాన యుగములో సామ్యయోగ మనగ సమాధిలో ననుభవింపవలసిన విషయము కాదు. మానవ సమాజమున కంతకును అనుభవైకవేద్యము కావలసిన విషయమిది. సామ్య

---

* 'సామ్యయోగ' పదమును వినోబా కల్పించిరి. సాంఘిక, ఆర్థిక సమానత్వమును సాధించుటకు చేయబడు ఆత్మశక్తితోడి అహింసాయుత వైజ్ఞానిక కార్య సాధన అది. ఇందు మానవుని ఆత్మవికాసమునకును, బాహ్యమున సామాజిక పరివర్తనమునకును సమాన ప్రాముఖ్యత కలదు. ఇచ్చట 'యోగ' మను పరపదప్రయోగము, పరస్పర విరుద్ధములగు ఇతర సాంప్రదాయముల సంకుచిత దృష్టినుండి ఈ విశాల దృక్పథమును వేరు పరచి చూపుట కుద్దేశింపబడినది.

యోగ మింతదనుక పైకప్పుగ నుండెడిది. ఇప్పుడది పునాది యైనది. మన మిప్పుడా ప్రాతిపదికపై జీవితములను రూపొందించుకొనవలెను. సామాన్యప్రజలచే గూడ మన మిపుడు చేయింపప్రయత్నించుచున్న కార్యవిధానము మన పూర్వుల ఆమోదమునుగూడ తప్పక బడయగలదు.

సర్వోదయములో మన భక్తికి నూతన రూపము రావలెనని నే నిదివరలో చెప్పియుంటిని. భక్తియొక్క కీలకమును ప్రహ్లాదుడు తెలిపియున్నాడు. నారదుడు ప్రహ్లాదుని గురువు; అయినను భక్తశ్రేణిలో ప్రహ్లాదునిదే అధ్యక్షపీఠము. తరువాతి స్థానము నారదునిది. భయంకరమగు నృసింహరూపమున భగవంతుడు ప్రత్యక్షమైనపుడు, అతని యర్ధాంగియగు లక్ష్మీదేవికూడ భయవిహ్వలయయ్యెను. ఎన్నడును నిశ్శబ్ద మెరుగని నారద వీణారవము ఆగిపోయెను. నారదుడును దిగ్భ్రమ చెందెను. ప్రహ్లాదు డొక్కడు నృసింహునియెదుట నిర్భయుడై నిలచి 'నిన్నుచూచి నేను భయపడుట లే'దనెను. ఇందులకే అతనికి భక్తులలో అగ్రగణ్యత.

ప్రహ్లాదుడు కోరిన వరమేమి? అతని ప్రార్థన యిది: "తమ ముక్తిని మాత్రమే కాంక్షించుచు, తదితరుల శ్రేయోభిలాష యేమాత్రమును లేక, ఏకాకులై మౌనముద్ర దాల్చిన దేవతలు, ఋషులు పూర్వమెందరో యుండిరి. అందరిని వదలివేసి ఒక్కడను మాత్రము ముక్తిపొందుటకు నే నిష్టపడను." మహాపురుషులుకూడ స్వార్థపరులై యుండిరను ప్రహ్లాదుని భావన ఎంత గొప్పది! 'నాకొక్కనికి ప్రత్యేకము

ముక్తి అక్కరలే'దని యన్నపుడు కవి హృదయ మెంత ఆవేశ ముతో పొంగిపొరలినదో !. సంస్కృతసారస్వతమున ఉత్తమ కల్పనలలో నిది యొకటి.

నిజమునకు ముక్తి 'నాది' యనుకొనవలసినది కాదు. తన కే మోక్షమనుకొనువాని నది తప్పించుకొనిపోవును. 'నాది' యనుకొనువానియొద్ద కది చేరదు. 'నామోక్ష' మనుట యే అసంగతపుమాట. 'నాది' యన నది అదృశ్యమైనప్పుడే మోక్ష ప్రాప్తి కలుగును.

పునర్జన్మల చక్రమున తగుల్కొందు మను భయముచే మహాపురుషులు కోరుకొను ముక్తి తనకు భయముకల్గించు చున్నదని తుకారాంమాట. తుకారాం పొందిన ఈ యనుభ వము అతని కాలమునకు కాదు; భవిష్యత్కాలమునకు. దూర దర్శియగు ఈ ఋషి భవిష్యత్ స్థితిని చూడగల్గెను. ముందు ముందు నిర్మాణము కావలసిన సాంఘిక వ్యవస్థయొక్క రూప మతనికి గోచరించెను. ప్రతివానికిని బ్రహ్మత్వము సిద్ధింప జేయగల సాంఘిక వ్యవస్థ యేర్పడవలెనని తుకారాం ఆశ యము. సమాధిస్థితుడు ప్రతివానిని బ్రహ్మగా దర్శించునని చెప్పుట తుకారాం ఉద్దేశ్యముకాదు. ఆ యనుభవము నంతకు చాల పూర్వమే తుకారాం పొందియుండెను. స్వార్థపరులై లోపములతో నిండిన మానవులు స్వార్థరహితులై, నిత్యము సంసారయాత్ర సలుపుచునే సమాధి ననుభవింపవలెనని అతని యాశయము. "అంద రేకమగుట, అందరొక సంఘ మగుట, అందరు బ్రహ్మమగుట నేనెపుడు చూతును ?" ఇట్టి

సామూహిక సమాధిని కోరియే తుకారాం ఈ ద్విపద పద్యమును వ్రాసినాడు.

ప్రతివారును పర్యాలోచన చేసికొనవలసిన విషయమిది. మన జీవితములను పరివర్తన మొందించుకొనవలెననునది యిందలి ముఖ్యాంశము. ఈలక్ష్యమును ముందుంచుకొనుచు, నేడు మన జీవితముల నావహించియున్న ఆర్థిక, సాంఘికాది వివిధ భేదములను పారద్రోలుదుము గాక!

పండరిపురము
29—5—'58



## 9. నిర్మాణ శక్తి త్రయము

సారస్వత గ్రంథ పఠనము వలన నే నెంతయు ఉత్తేజితుడ నగుచుందును; కవితా దేవతపై విశ్వాసముతో నా హృదయము నిండియుండును

పూర్వపు విషయ మొకటి జ్ఞాప్తికి వచ్చుచున్నది. నా బాల్యములో పదేండ్లొక పల్లెటూరిలో గడపితిని; తరువాత మరి పదేండ్లు బరోడా నగరములో నుంటిని. నేను మా గ్రామమందున్నపుడు మా తండ్రి తన విద్యకును, ఉద్యోగమునకును బరోడాలో నుండెడువారు. దీపావళి పండుగకు ఆయన స్వగృహమునకు వచ్చుచుండువారు. "మీనాన్నగారీ రోజున యింటికి వత్తురు. నీకాయన పండ్లు, మిఠాయి తెచ్చును" అని యొకనాడు మా అమ్మ నాతో అనెను. కాని నావిద్య అప్ప

టికే ప్రారంభమయ్యెను. ఆగ్రామమున పాఠశాల లేదు; మా పినతండ్రి నా కక్షరములు నేర్పెను.

తండ్రిగారు వచ్చిరి. నే నాయనవద్దకు వెళ్ళగా నే నాకు మిఠాయిల నిచ్చిరి. అవి గుండ్రముగా నుండుననుకొంటిని. కాని యా పొట్లము గుండ్రనిదికాక బల్లపరుపుగా నుండెను. అదేదో క్రొత్తరకపు మిఠాయనుకొంటిని. కాని పొట్లము విప్పగా అందున్నవి రెండు పుస్తకములు. వానిని తీసికొని వెళ్లి మా తల్లియెదుట నుంచితిని. "కుమారా, ఈనాడు మీ నాన్నగారు తెచ్చినదానిని మించిన మిఠాయి మరియొకటుండదు సుమా!" అని అన్నదామె. అవి రామాయణ, భారత కథల పుస్తకములు. తరువాత, వానిని కొన్నిసారులు నేను చదివియుందును. ఆనాటి మా తల్లిమాటను నే నెప్పుడును మరువలేదు. అది నా మనస్సున గట్టిగ నాటుకొనెను. మంచి భావములు గల పుస్తకమును మించిన మధురవస్తువు నిజముగ మరేదియు లేదు.

భగవంతు డనంతశక్తుడు; కాని సారస్వత మతని ప్రత్యేక శక్తులలో నొకటి. కవులకును, తదితర గ్రంథకర్తలకును ఉత్తేజమునిచ్చునదీ శక్తియే. ఈశక్తి వారికేగాని మరెవ్వరికిని తెలియదు. మహమ్మదు సమాధియందున్నపుడు అమితమగు చెమటలు పోసెడివట. అట్టి స్థితిలో ఆతని కేమి సంభవించునో దగ్గరనున్న వారికి తెలిసెడిది కాదు. భగవంతుని సందేశము నందుకొనగల శక్తి అతనికుండెను. ఈశ్వర సందేశముతో హృదయము బరువెక్కియున్నపుడు అనిర్వచనీయ

మగు తీవ్రవేదన కలుగును. ఈబాధను ప్రసవవేదనతో పోల్ప నగును; అది ప్రసవవేదననుకూడ మించియుండును. ఇది స్వానుభవమును బట్టి చెప్పుచున్నాను. తన్నుదా కోల్పోయినట్లు, విదలించిపారవేయుదమన్నను విదలించరాని దేదో నన్ను గట్టిగ పట్టివేసినట్లు, ఒక యాతనవంటి దేదో హృదయము నాక్రమించును. ఆబాధకు తరువాత ప్రత్యక్షదర్శనము కలుగును. దాని ఫలితముగ నొక ఉత్తమ కళ నిర్మితమగును. ఆపైన ప్రజ లా కళను గైకొని తృప్తిని, ఆనందమును పొందుదురు. కాని కవులు, కళానిపుణులు పొందు వ్యథయొక్క అనుభవము ప్రజలు పొందరు.

సంస్కృతమున 'కావ్యరచయిత' యను అర్థమునిచ్చు 'కవి' శబ్దమును కొలదిమాటలలో నిర్వచింపలేము. ముందేమి జరుగనున్నదో తెలిసినవాడు కవి; అనగా ఆవల నేమున్నదో తెలిసికొను ద్రష్ట. ఈవల, అనగా ఇక్కడ నేమున్నదో చూడగల రెండు కండ్లు మనకున్నవి. అవియు ఉపయుక్తములే. మన యెదుటి ప్రపంచమునం దేమున్నదో తెలుపు సాధనములవి. ప్రాపంచక సౌందర్యము నంతను మన కవి ప్రదర్శించును. కాని ఈ రెండు కండ్లు నిర్దోషములు కావు. వాని చూపునకందనిది, వానిచే మరుగుపరచబడునది వేరొక ప్రపంచమున్నది. మన ప్రపంచము కంటె ఎక్కువ మనోహరమగు ఆ రెండవ ప్రపంచము ఈ చర్మచక్షువు లుండుటచేతనే మనకు అగోచరమగుచున్నది. ఆ ప్రపంచముచే మానవు డాకర్షింపబడనొల్లడు. మూడవ నేత్రము తెరువబడినప్పుడే మానవునికి ఆదర్శనభాగ్యము ఈషణ్మాత్రము ప్రసాదింపబడును. అత్యల్ప

సంఘటన లన్నిటి వెనుకను, అంతరమునను గూడ రహస్యముగ పనిచేయు శక్తియొకటున్నదను అనుభూతి ఆదర్శనముతో కలుగును. మరల ఈ యనుభూతి నుండియే గొప్ప సారస్వత ముద్భవిల్లును.

ప్రపంచజీవితమును రూపొందించు పనిలో భగవంతుడు కాక మరెవరుకూడ భాగస్థులై యుందురను ప్రశ్నకు 'రాజ్యాంగవేత్తల'ని కొందరు జవాబిత్తురు. బాబరు వచ్చి పలానా కార్యములు చేసెనని యందురు. అట్లే క్లైవు ప్రభువు కూడ చేసెననుచుందురు. ఇట్టి కథలతో గూడిన చరిత్ర పాఠశాలలలో నేర్పబడుచున్నది. కాని బాబరు, క్లైవుల ప్రభావ మీ నాటి సంఘమ్ముపై నించుకయు కనబడదు. ప్రపంచ రూపరేఖలను దిద్దు శక్తులు సరిగా మూడు. అవి విజ్ఞానము, ఆత్మజ్ఞానము, సారస్వతము.

వైజ్ఞానికుడు ప్రపంచజీవితమునకొక రూపమునిచ్చును. నా ముందరనున్న దూరశ్రవణయంత్రములు ఇందరు ప్రజలు నామాటలను శాంతితో వినగలుగునట్లు చేసినవి. ప్రాచీన మానవు లీ విషయము నూహింపగలిగికూడ యుండరు. ఇది బాహ్యపరివర్తనమును కలిగించుటయేగాదు; ఆంతరిక, మానసిక పరివర్తనమునకుగూడ దారిచూపుచున్నది. ముద్రణయంత్రము ద్వారా కలుగు అపార జ్ఞానాభివృద్ధినిగూర్చి పూర్వులెవ్వరును తలచియుండరు. మంచితో పాటు కొంత చెడుగు కూడ వ్యాపించుచున్నదనుట నిజమే. అయినను విజ్ఞాన ప్రభావముచే జీవితము పరివర్తన మొందుచున్నది. అగ్నిని కను

గొన్నపుడు ఋషులు భక్తితో దానికి ప్రార్థనలు సలిపి స్తోత్రము చేసిరి. అట్లే ఈరోజున మనము అణుశక్తిని స్తవము చేయవచ్చును. అణుశక్తి విధ్వంస కారకముగ మనకు దర్శన మిచ్చినది. కాని యది విధ్వంసకరమగు రుద్రస్వరూపిణి మాత్రమే కాదు, నిర్మాణాత్మకమగు శివస్వరూపిణికూడ. అది నిర్మాణాత్మకరూపమును దాల్చినపుడు ప్రపంచజీవితము పూర్ణ పరివర్తనము జెందును.

జీవిత రూపమును నిర్ణయించు రెండవ శక్తి ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞాన మెచటెచట విలసిల్లునో అచటచట నది జీవితమును పరివర్తన మొందించియే యుండెను. గౌతమబుద్ధుడు, జీసను, మహమ్మదు, లియోాసే, జ్ఞానదేవుడు, తులసీదాసువంటి జ్ఞానులు కాలక్రమమున అవతరించియున్నారు. ఒక్కొక్కరి రాకతో మానవజీవితమందు గొప్ప మార్పులు కలుగుచు వచ్చెను.

సారస్వతశక్తి:

మూడవది సాహిత్య పండితుని శక్తి. వాల్మీకి, వ్యాసుడు, షేక్స్పియరు, హోమరు, శంకరాచార్యుడు, రవీంద్రుడు—ఇత్యాదులు విలువగల శాశ్వత లాభమును మానవ జాతికి చేకూర్చిరి. శాంతి ఆవశ్యకమైనపుడు శాంతి నీయగల సాహిత్యమును నిర్మించిరి. ఉత్తేజన మవసరమైనపుడుఉత్తేజము నిచ్చు సాహిత్యమును కల్పనచేసిరి. ఆశను పురికొల్పవలసినపుడు ఆశాజనకమగు సారస్వత రచనల నిచ్చిరి. సంఘమునకేది కావలసినపుడు దానినే వారు సమకూర్చుచు వచ్చిరి.

గొప్పవగు జీవితపు మార్పులు, మహా విప్లవములు మానవ చరిత్రలో సంఘటిల్లినవి. జ్ఞానులు, సాహితీకోవిదులు వీని యన్నిటికిని అండయై నిలిచి, మార్గదర్శకులైరి.

ఇంతవరకీ మూడు శక్తులు మానవ జీవితమును తీర్చి దిద్దినవి. ఇట్లే యికముందుకూడ నవి మన జీవితమును సరిదిద్దుచుండును. విజ్ఞానము బాహ్యజీవిత పరివర్తనము కలిగించుచు మనస్సుపైగూడ పనిచేయఁగల బాహ్యస్థితిగతులను కల్పించ గలదు. సూటిగ మానవహృదయమును మార్చగలశక్తి విజ్ఞానమునకు లేదు. వాణి, అనగా వాక్కు విజ్ఞానముకంటె ముందు నడచుచు, నేరుగా మానవహృదయము నెదుర్కొనును. ఆత్మజ్ఞానము అంతరాంతరమున నున్న వస్తువును విశదీకరించును. విజ్ఞానమునకు బాహ్యప్రకృతితోను, ఆత్మజ్ఞానమునకు హృదయాంతరాళముతోను సంబంధము. సారస్వతమీ రెంటికిని మధ్యవర్తి; రెంటిని కలుపు వంతెన. రెండుకొనలను కలుపుచు, రెంటికిని అది సౌందర్యము నిచ్చును. "బాహ్యాంతరప్రపంచముల రెంటిని ఉద్దీపింప దలతువేని, రామనామమును జిహ్వయొక్క ద్వారముకడ నిలువబెట్టుము" అని తులసీదాసు అన్నాడు. రామనామోచ్చారణ మానవుని బాహ్యంతరముల రెంటికిని ఉత్తేజము నీయగలదు. వాక్కు మానవునికి దేవుడిచ్చిన ప్రత్యేకవరము. ఇది యితర జంతువుల కీయబడలేదు. సాలమన్ పక్షులభాష నెరిగియుండెనని చెప్పుదురు. పక్షులకు భాష లున్నవో లేవో నాకు తెలియదు. కాని మానవభాషకున్న శక్తి చాల గొప్పది. దాని దుర్వి ని

యోగము సంఘమును విచ్ఛిన్నముచేయును. ధాన్యమును బాగుచేయునపుడు, గట్టిగింజలను మాత్రమే తీసికొని, పొల్లును పారవేయుదుము. పరిశీలనతోను, పర్యాలోచనతోను భాషా ప్రయోగముచేయు సంఘమునే సౌభాగ్యదేవతయగు లక్ష్మి ఆశీర్వదించునని ఋగ్వేదవచనము. జ్ఞానులు భాషను బాగుగ పరిశోధింతురు; స్ఫటికమువంటి ఉత్తమ, సున్నితపదములను ఏరి వాడుకచేయుదురు. ఈరూపేణ సంఘమునకు లక్ష్మీదేవి యొక్క ఆశీస్సులు లభించుచున్నవి.

విద్యాదేవియగు సరస్వతికిని, భాగ్యదేవతయగు లక్ష్మికిని అన్యోన్యత లేదని తరుచు అనుచుండుట వాడుక. కాని ఋగ్వేదము దీనికి పూర్తిగ వ్యతిరేకార్థమునిచ్చు మాటచెప్పుచున్నది. లక్ష్మీసరస్వతులు శత్రువులనుటలో నెంత విస్మయముగొల్పు అజ్ఞానమున్నది! సరస్వతియన నొక సంయోగ శక్తియే; ఆమె బాహ్యమును అంతరముతో, అనగా విజ్ఞానమును ఆత్మజ్ఞానముతో కలుపును. ప్రపంచమందలి వివిధశక్తులను కలుపగలిగిన దేదైన యున్నచో అది వాణియే, అనగా వాక్శక్తియే. సరస్వతి లక్ష్మికెట్లు శత్రువు కాగలదు? వాణి లేక వాక్కు సూక్ష్మమగు శక్తి; ఇతరశక్తు లనేకములు దాని యందు దాగియున్నవి. ఆమెయెడల నా కమిత విశ్వాసము. నేను విరామములేక మాట్లాడుచుందును. కాని శ్రద్ధతో నాలకింతును కూడ.

నాకు కావలసినది వాక్ప్రచారము కాదు; నేను కోరుకొనునది సత్యప్రకటనము. హిందూస్థానమున 'ప్రకాశ'మనున

దాక విశిష్ట పదము. ప్రచారము (propaganda), ప్రచురణ (publicity) అను ఆంగ్లపదములు కేవలము తేలికమాటలు. అతిశయోక్తులతో మన కార్యక్రమమును ప్రజలముందుంచుటకు నాకిష్టములేదు. ప్రతిహృదయమును తాకునంత గంభీరముగ దానిలోపలి తత్త్వముండవలెనని నా కోరిక. ఈ తత్త్వమిప్పటికంటెను బలయుతము, గభీరము, విశ్వజనీనముచేయబడునుగాక! ఇంతకెక్కువ గభీరము, విశ్వజనీనమునగు భావము నా కింతవరకు అనుభవములోనికి రాలేదు. ముందు తరముల వారికి దీని యనుభూతి కలుగవచ్చును. సర్వోదయతత్త్వమును బలపరచుటకు గాను, మనము ప్రాచీన ఋషులు, జ్ఞానులు అందరికంటె లోతునకు వెళ్ళవలెను. సర్వోదయమును పరీక్షింపగల గీటురాయి అది.

ఆత్మజ్ఞాని తన్నుదా నెప్పుడును విక్రయించుకొనడు. అతడు పూర్ణస్వతంత్రుడు, తనమాటను ప్రపంచము వినుచున్నదా లేదా యని అతడు లెక్కచేయడు. కనుకనే తులసీదాసు "ప్రజల పాపములను కడిగివేయగలిగినదే నిర్మాణశక్తిగల వాక్కు" అన్నాడు. అట్టిదానినే మనము సారస్వతమన జెల్లును. ఉత్తమ సారస్వతమన నదియే. మిగతదంతయు వట్టి మాటలు.

పండరిపురము
29—5—'53



# 10. విజ్ఞానయుగమున సత్యాగ్రహము

సత్యాగ్రహమును గూర్చి తనకున్న జ్ఞానము చాల తక్కువయని గాంధీజీ చెప్పుకొనుచుండువాడని, ప్యారిలాల్ గారు "అంత్యదశ" యను తన గ్రంథమున వ్రాసినారు. సత్యాగ్రహ విజ్ఞానము చాల లోతైనది. దానినిగూర్చిన పరిశోధన ఎంతైన జరుగవలసియున్నది. గాంధిజీ చెప్పిన ఈ మాట కేవలము నమ్రతకాదు. సత్యాగ్రహములో మనము చేసిన ప్రయోగము లన్నియు చీకటిలో తడవులాట వంటివే. స్పష్టమగు వెలుగు మనకు లభించలేదు. లభించిన ఆ రవంత వెలుగుతోనే మనము ముందుకు పోగలిగితిమి. ప్రజారాజ్యములో సత్యాగ్రహముయొక్క స్థానమున్ను గూర్చి ఇతఃపూర్వము నేనుకొంత చెప్పియుంటిని. ఆ దృష్టితో నేనీనాడు మాటలాడదలచలేదు. ప్రజా ~ జ్యము అల్పవిషయము. మనది ప్రజా రాజ్యము మాత్రమే కాదు; ఇది విజ్ఞానయుగముకూడ. మానవజీవితమును రూపొందించు శక్తులు మూడని నేనొక ప్రసంగమున చెప్పియుంటిని. అవి విజ్ఞానము, ఆత్మజ్ఞానము, వాక్కు. జీవితమును రూపొందించువారిలో ముఖ్యులు రాజకీయవేత్తలని పలువురి అభిప్రాయము. ఇండియా ప్రజాజీవితమును బాబరు నడిపించెను. అట్లే ఘనుడగు అలెగ్జాండరు, క్లైవు ప్రభువు కూడ. కాని యిది తప్పుడు అభిప్రాయము. క్లైవు కాలమున ఐరోపాలో విజ్ఞానశాస్త్రము చాల వృద్ధినొంది, ఆంగ్లాభ్యుదయమునకు తోడ్పడెను. ఇండియా ఓడలక ఔ ఇంగ్లాడువి పరిశస్త్రమైనవి. శివాజీ పోర్చుగీసులనుండి ఖడ్గములను కొనెడి

వాడు. బాబరు అలెగ్జాండరుల దండయాత్రలు, మార్కోపోలో కొలంబసుల సముద్రయానములు విజ్ఞానాభ్యుదయము వలననే సాధ్యములయ్యెను.

విజ్ఞానమును ఉత్తమోపయోగమునకు దెచ్చుకొను మార్గమును చూపునది ఆత్మజ్ఞానము. ఏ యుగమునందుగాని విజ్ఞానమువలన మానవుడు పొందగల లబ్ధి అతడు సంపాదించిన ఆత్మజ్ఞానమును బట్టియే యుండును.

సారస్వతముద్వారా బయల్పడు వాక్శక్తి విజ్ఞాన ఆత్మ జ్ఞానములు రెంటికిని మధ్యవర్తి.

విజ్ఞానయుగమున సత్యాగ్రహము తాల్చవలసినరూపమును గూర్చి మీకీనాడు చెప్పదలచినాను. బడితె చేతబట్టుకొని శత్రువు మనల నెదుర్కొన్నప్పుడు, దండము నుపయోగించుట చాల తప్పుపనియని చెప్పి దయార్ద్రహృదయుడొకడు అతనికి నచ్చజెప్పవచ్చును. గొడ్డలి చేబూని నారదు నెదుర్కొన్న దుండగీడు వాల్మీకి హృదయము మారిపోయినట్లే, మన శత్రువుకూడ మంచివాడుగ మారవచ్చును. అయితే శత్రువు విమానమునుండి బాంబులు వదలినప్పుడు గాని, తన గదిలో తాను క్షేమముగ గూర్చుండి బొత్తాము ('స్విచ్చి') నొక్కితేగాని మనము చేయవలసిన దేమి? అట్టిచో సత్యాగ్రహ మెట్లు జరుపవలెను? సత్యాగ్రహియొక్క కృపావీక్షణములు గాని మృదుభాషణముగాని ఎందుకు పనికివచ్చును?

విజ్ఞానము ముందుకు సాగినకొలది ఆత్మజిజ్ఞాసాపథమందు మనమింకను లోతులకు వెళ్ళవలసియున్నాము. మనకు

పూర్వముండిన వారు కనుగొనినలోతు చాలదు. కొద్దిమంది వ్యక్తు లొకమూల కూర్చుండి విశ్వమంతటిని విధ్వంస మొనర్ప గల శక్తిని విజ్ఞానము కలిగించినది. యావత్ప్రపంచముపై మన ప్రభావమును వ్యాపింపజేయగలుగునంత సత్యాగ్రహ శక్తిని మనము పెంపొందింపవలెను. ఇంతకుమించి సత్యాగ్రహమున కిక గత్యంతరము లేదు.

దురవగాహమగు గూఢతత్వము కాదిది. మనన ధ్యానముల ద్వారా తపస్వులును, భక్తులును పొందు అనుభవము మనకు చరమలక్ష్యము కారాదు; అదియొక ఉపశమనము వంటిది—అంతే! భక్తుల కోరికలను బట్టి భగవానుడు వారికిచ్చు ఊరట యది. అట్టి యూరటతో తృప్తిజెందుచు, దానినే ప్రత్యక్షానుభూతి యనుకొనువాడు ఇంకను లోతునగల అనుభవములను కోల్పోవును. అట్టి నిగూఢ తత్వసాధనయు గొప్పదే. దుర్గ్రాహ్యమగు విశ్వముతో నికటసంబంధమును కల్పించుకొనుట నిజముగ గొప్ప సాధనయే. అయితే దాని శక్తి మన ప్రస్తుతావసరములకు చాలదు. అణువుయొక్క విధ్వంసకశక్తిని ప్రతిఘటించగల శక్తిని మనమిపుడు కనిపెట్టవలెను. కాని మనస్సుయొక్క ఆధీనతలో కట్టుబడియున్నంత వరకు మన మీ శక్తిని సంపాదింపలేము. ఈ సమస్యనుగూర్చి నేను యోచించినపుడెల్ల రాష్ట్ర సరిహద్దులు, భాషలు, మతములు, కులములు మొదలగు స్థానిక విషయములు దానిముందు అత్యల్పముగ కాన్పించును.

విజ్ఞానశాస్త్రము వింతగా అభివృద్ధి నొందిన ఈ కాలమున మనస్సును మార్చుటకు మానసిక సాధనలు పనిచేయ

వను సత్యమును మనము గుర్తింపవలెను. మనము మనస్సును లెక్కగొనక ముందుకు సాగిపోతిమా మనస్సు దానియంతట అదే నశించిపోవును. దాని నిక మార్చవలెనను ప్రశ్నయే యుండదు. మానవుడు తన తప్పులను దిద్దుకొని హృదయపరివర్తనము నొందవలెనన్నట్లు, అందులకు మన మతనికి తోడ్పడవలెనన్నట్లు భావించుచుందుము. కాని అసలు మనస్సే లేదన్న ప్రాతిపదికతో బయలుదేరవలెనని నాతలంపు.

ఈ విజ్ఞానయుగమున పాతకాలపు పద్ధతు లంతగా పని చేయవు. నే నిట్లనుటవలన వినోబా శ్రీ అరవిందుని అనుచరుడై పోయినాడని వాదు వేయుదురు కాబోలు! కాని నా కీ భావము క్రొత్తగా కలిగినదికాదు. వెనుకటి మంత్రాంగపు వ్యవహార పద్ధతులు, పూర్వ సాంప్రదాయ సారస్వతము మన కిపుడు సహకారులు కాజాలవు. నూతన పద్ధతులను మన మవలంబించవలెను. నిజమగు మత మింతవరకును నిర్మాణము కాలేదని కూడ నేను చెప్పియుంటిని. దానికి సరియగు పునాది వేయబడలేదు. పూర్వకాలమున వి జ్ఞా న ము లేకుండెను. ఋషులు తమ ధ్యాననిష్ఠలో దర్శించిన కొలదిపాటి విషయములను మాత్రము కేవలము నమ్మకముపై ప్రజలు స్వీకరించిరి. ఆవిధముగ కొన్ని నమ్మకములు స్థిరపడిపోయినవి. కాని ఆ నమ్మకములకు తగినంత యాధారములేదు. సత్యము, అహింస వంటి సిద్ధాంతముల కిదేగతి పట్టినది. సత్యము కావలసినదే యని ప్రజ లొప్పుకొందురు; కాని అన్ని పరిస్థితులలో కాదందురు. గృహనిర్మాత రేఖాగణిత సిద్ధాంతముల ననుసరించునంత నిక్కచ్చగ మానవుడు సత్యమును స్వీకరించలేదు.

అనగా అనుల్లంఘనీయమగు సత్యశాసన మింతవరకు అమలులోనికి రాలేదని, యథార్థమగు మతము నిర్మాణము కాలేదని దీని యర్థము. విజ్ఞానమొక్కటే మతమునకు పునాదివేయును. ఇప్పుడు మతమనునది మనస్సుచే బంధింపబడియున్నది. నిజమగు మతస్థాపన చేయుటకు ఈ యావరణమును దాటవలెను. అప్పుడు విజ్ఞానమునకు మతమునకు సమన్వయము కుదురును; పోరాటముండదు. ఈవిషయములతో నాకుగల సంబంధమును బట్టి, ఆధ్యాత్మిక నివృత్తి స్థితి కభిముఖుడనై పోవుచున్నాను. ఈ నివృత్తి జగత్తుసత్య మను సిద్ధాంతమునకు, అనగా ప్రవృత్తికి వ్యతిరేకము కాదు. అట్లు వ్యతిరేకముగనున్న జగన్మిథ్య (నివృత్తి) సిద్ధాంతముకూడ మరియొక విధమగు ప్రవృత్తియే. అణువుయొక్క విధ్వంసకశక్తిని ప్రతిఘటించుశక్తికొరకు నేనిపుడన్వేషించుచున్నాను. సత్యాగ్రహశక్తి యొక్కటే ఆ శక్తి యని నాకు తోచుచున్నది.

అణుశక్తి రహస్యములను పరిశోధించువారు కొలదిమంది మాత్రమే. అయినను వారు కనుగొన్న సత్యముల వలని ఫలము మానవులందరికిని ఉపయోగపడును. విద్యుచ్ఛక్తిని కనుగొన్న వ్యక్తి ఒక్కడే అయినను ఇప్పు డందరును దాని ఫలము ననుభవించుచున్నారు. అట్లే ఆధ్యాత్మిక శక్తిని కనుగొన్నవా డొకడే యైనను, అది లోకకళ్యాణమునకు వినియోగపడును.

అంతర్జాతీయ వ్యవహారములలో సత్యాగ్రహమెట్లు ఉపయోగపడగలదు? సత్యాగ్రహము ఆధ్యాత్మిక శక్తిని

నిరూపించును. అంగబలము కాదది; మనోబలమును కాదు. విజ్ఞానము స్వతస్సిద్ధముగ మానవుని మనస్సును లోకువచేయును. సత్యాగ్రశక్తిని తెలిసికొనవలెనన్నచో, మనస్సునతీతించగల స్థితికి మనము చేరవలెను. ప్రజాభిప్రాయమును బట్టి గాక, ప్రభుత్వముద్వారా గాక సత్యాగ్రహమార్గముననే అంతర్జాతీయ సమస్యలను తీర్చవలెనన్నచో మనస్సునతీతించగల ఎత్తునకు పోవలెను. భూదాన యాత్రలో ప్రజలతో నాకేర్పడిన పరిచయమువలన ప్రజా మానసికతత్వ మెక్కడైనను మూలమందొకటే యని నాకు బుజువైనది. మానవుని మనస్సు సర్వత్ర ఒకేమెట్టునందున్నది. కనుక ఒకఆత్మయందు ద్యోతకమయి, జగత్తునకు ప్రేరణ నీయగల శక్తిని మనము సంపాదింపవలెను. వ్యక్తి, తన జీవితములో మనస్సుయొక్క హద్దులను దాటిపోగలిగినప్పుడే యిది సాధ్యమగును.

ఉస్మానాబాద్
12—6—'58



## 11. మనస్సు నతీతించుట

ఈ యుద్యమము శక్తివంతము, గభీరము అగుచున్న కొలది సేవకులు ఉన్నతస్థాయికి లేచుచు, అందలి యాధ్యాత్మిక తత్వమును గ్రహించుటకుగాను లోతునకు దిగవలెను. భేదభావములను నశింపజేయుటకును, హృదయము పరిశుద్ధమగుటకును ఇదియే మార్గము.

ఇద్దరు వ్యక్తులలో వైమనస్యముకలిగినపుడు బాపూజీ వారి నిద్దరిని తనవద్దకు రప్పించి, తాను వారి స్థితికి దిగివచ్చి, వారితో గంటల తరబడి చర్చచేయుచుండువాడు. ఆయన ప్రయత్న మొకప్పుడు సఫలము, మరొకప్పుడు విఫలము అయ్యెడిది. ఇదియు ఒక మార్గమే కాని ఎక్కువ ప్రయోజన కారి కాదు. దాని స్వభావము మానసికము కనుక విజ్ఞాన యుగములో నది బాగుగ పనిచేయదు. స్పష్టముగ బయటికి కనబడునది, వ్యక్తులను లెక్కగొననిది యగు సత్యమే విజ్ఞాన యుగమున ప్రాధాన్యతపొందును. ఒకానొకవ్యక్తి మనస్సులో నేమున్నదో అను విషయముతో పనిలేదు. బాహ్యజగత్తు, మనస్సు అను రెంటిలో మనస్సునే విజ్ఞానము ఆత్మజ్ఞానము కూడ తక్కువగపరిగణించును. మనస్సు తన్నుదాను అతీతించ వలెనని ఆత్మజ్ఞానము కోరును. విజ్ఞానము కోరునదియు అదే.

అయితే మానసిక విభేదములు కలిగినపుడు చేయవల సినదేమి? ఉపేక్షవలన మాత్రమే వీనిని ప్రతిఘటింపనగును. ఉదాసీనతయొక్క శక్తిని మన మింకను సంపాదింపవలసి యున్నాము. మనస్సుకు పైనున్న అంతస్థునుండి పనిచేసి నప్పుడే మన ప్రయత్నము సఫలమగును. కనుకనే శ్రీ అర విందుడు మనోతీత స్థితినిగూర్చి చెప్పుచుండెడివాడు. ఆత్మోప లబ్ధియను అమృతముతో తృప్తిపడుట సమంజసముకాదు. అట్టివాడుకూడ నూతనజీవితమును పొందును. మనలో పలు వురు తమతమ కర్మభావముచే మరల పుట్టుచుందురు; అందే మియు విశేషములేదు. కాని తనివిదీర బ్రహ్మామృత రస

పానము చేసి, మానసేంద్రియాతీతుడయిన మీదటకూడ పొందెడు పునర్జన్మను శ్రీ అరవిందుడు 'అవతరణ' మన్నాడు. ముక్తి చరమలక్ష్యము కాదు. ముక్తియనంతరము ఒక నూతన కర్మక్షేత్రము, నూతన కార్యక్రమము ప్రారంభమగును. ఇదే మనస్సు నతీతించిన స్థితి.

ముక్తుడైనవాడు, మరల పుట్టవలెనని కోరుకొన్నను, తిరిగి రాజాలడని పూర్వమనుకొనెడువారు. అట్లయినచో నతడు ముక్తిలో లీనమైపోవును. శ్రీ అరవిందుని తత్త్వము ఇట్టి ముక్తికి తక్కువ ప్రాముఖ్యము నిచ్చును. ముక్తినిపొంది మరల పుట్టుట జరుగదని శంకరాదులందురు. కాని శ్రీ అరవిందుని సిద్ధాంత ప్రకారము మోక్షము పొందినవాడే మానవ సేవకు అర్హతను సంపాదించును. ముక్తుడు కాని వాడునిజమగు సేవ యొనర్ప లేడు; ఎందులకన ముక్తుడు కానివానిలో తప్పులు చేయుట కవకాశ ముండనే యుండును.

సాంఘిక పరివర్తనమును, హృదయ పరివర్తనమును తీసికొనిరాగల శక్తి మనకున్నదాయని మనము ప్రశ్నించుకొనుచుండవలెను. ఆ శక్తిని బడయుటకు గాను మానవుడు ముక్తుడు కావలెను. అయినను చాలదు. బ్రహ్మానుభూతిని పొంది, తద్వారా మనస్సు నతీతించవలెను. అటు తరువాత తన భావనాశక్తిచే ప్రపంచజీవితమును మార్చుటకు, ఆ యెత్తు నుండి మరల ప్రపంచమున అవతరించవలెను. సంఘమంతకును అతడొక దివ్యరూపము నిప్పించవలె. ఇది చాల గొప్ప తత్త్వము. ఆ యున్నత శిఖరమునుండి మరల దిగిరావలెనను

కోరిక నటుండనిచ్చి, కనీసము మనోప్రపంచము నతీతించుట యైనను అత్యావశ్యకము. కానిచో సంఘ మాలిన్యమును తీసివేయజాలక, సాంఘిక యంత్రచక్రములు బిగిసిపోకుండ మాత్రము, బయటనుండి వానిలో ఎల్లప్పుడు నూనెవేయు చుండవలెను. కాని సంఘ యంత్రము రాపిడిలేక నూనెను కోరకుండ ఉండవలెను. మన శరీరము నందలి యెముకలు ఒక దానితో నొకటి రాచుకొని ధ్వనిచేయవు కదా! వివిధావ యవముల మధ్య సహజమగు సహకారమున్నది. కాలికి దెబ్బ తగిలిన తక్షణమే, చేయి దాని సహాయార్థము వెళ్ళును. సాంఘిక వ్యవస్థకూడ అట్లు నిర్మాణమైనచో నూనెబుడ్డి అనవ సరము.

శ్రీ అరవిందుని తత్వమును గూర్చి ఇప్పుడే చెప్పి యున్నాను. ఇట్టి మహామహుల భావములతో మనకు పరి చయ ముండవలెను. ప్రపంచ భావస్రవంతులను గూర్చి మనమే కేవలము అజ్ఞులమై యుండరాదు. అందలి క్రొత్త విషయములను తెలిసికొనుచుండవలెను. ప్రజలపై వాని ప్రభావ మెంత యుండగలదో, అందుండి మనమేమి స్వీకరింప గలమో కూడ తెలిసికొనవలెను.

"ఇంతటి మహాకావ్యము నెట్లు వ్రాయగలిగితిర"ని నే నిటీవల మైసూరులో శ్రీ పుట్టప్ప నడిగితిని. ఆయన యిట్లు బదులుచెప్పెను: "భారత దేశమున కావ్యము లావశ్యకమైన కాలమిది. కడచిన అర్థశతాబ్దములో ఈ దేశమున పుట్టినంత మంది వీరపురుషులు ప్రపంచమున మరెచ్చటను పుట్టలేదు. కనుక మన కిది కావ్యములకు తగినకాలము."

కనుక విజ్ఞానయుగము కవులతో పనిలేని కాలమని యనుకొనుట తప్పు. ఈయుగము సృష్టిరహస్యముల నధికాధికముగ వెలిబుచ్చుచున్నది. ప్రాచీనులకీ రహస్యము లంతగా తెలియవు. విజ్ఞానము తెలిసిన విషయములతోను, కవిత్వము తెలియని రహస్యములతోను పనిపెట్టుకొనుననుట వాడుక. సృష్టిరహస్యము లిన్నియున్నవని పురాతన మానవులకు తెలియనే తెలియదు. అందుచే కవిత్వ కళకు అవకాశములును తగ్గిపోయెను. నేడు సృష్టిరహస్యములు బహిర్గతములైనకొలది, కవిత్వమున కెక్కువ పనియుండును. కనుక విజ్ఞానయుగము ముఖ్యముగ కవిత్వమున కెక్కువ యనుకూలముగనున్నది.

పాండవపురం
30—9—'57



## 12. విజ్ఞానముయొక్క పిలుపు

మానవుడుకూడ జంతువేయైనను, కొన్ని విశిష్ట గుణముల వలన ఇతర జంతువులనుండి వేరగుచున్నాడు. భేదమిది: జంతు జీవితమును నడుపునది ప్రాణశక్తి; మానవ జీవితమును నడుపునది ముఖ్యముగా మనస్సు. మనుష్యునిలో ప్రాణము, మనస్సు రెండును ఉన్నవి. అయినను ఇక్కడ మనస్సుదే హెచ్చుప్రభావము. జంతువు కదలెనేని, వడిగా పరుగెత్తును; ధ్వనిచేయుచో బిగ్గరగా చేయును. ఆ కదలికలోను, ధ్వనిలోను ప్రాణశక్తిమాత్రమే వ్యక్తమగుచున్నది, మనోశక్తి కాదు. జంతువు దుముకును, అటు నిటు పరుగెత్తును, మొర

గును. ఇవన్నియు ప్రాణసూచకములే. ఈ పనులలో దానికి దెబ్బతగిలినను, బాధకలిగినను అంతగా లెక్కయుండదు. ఆడు కొనుచు బిడ్డలుకూడ రాళ్ళు రువ్వుదురు. ఒకరిని కొట్టు నుద్దేశము బిడ్డకు లేకున్నను, ఎవరినో ఒకరిని కొట్టి బాధించుట జరుగును. కాని యీపనిచేయుటలో బిడ్డకు మనో వృత్తి బొత్తిగ లేకపోలేదు. తలపు, కోరిక, ఆశ, నిరాశ మానవునిలో పనిచేయు శక్తులు. భయము, ధైర్యము, ప్రేమ, మమకారము ఇవియు మానవుని మనోవృత్తులు.

జంతువులో ప్రాణము, మానవునిలో మనస్సు ప్రధానములు. అయితే మానవుడు మనస్సు నతీతించి విజ్ఞానస్థితి నందుకొనవలెనని విజ్ఞానము బోధించుచున్నది. మనస్తత్వ శాస్త్రమును పూర్తిగ కొట్టివేయుటయే దీని తాత్పర్యము. మనస్తత్వశాస్త్రము యెడల విజ్ఞానమునకు మొదటినుండియు నిర్లక్ష్యభావమే. క్రిందనున్న మనుష్యులు అపరాధులా నిరపరాధులా యని పైనుండి పడు ఆటంబాంబు ఆలోచింపదు. మంచిచెడుగుల వివక్షత అచటలేదు. పొంగిన నదీప్రవాహము వలె అదియు మనుష్యులు, జంతువులు, కొయ్యదుంగలు అను భేదము నెంచకుండ అన్నిటిని తుడిచివైచును. ఇట్లు విజ్ఞానము మనస్సుయొక్క ఆవరణను దాటివెళ్ళును.

ఈ విశ్వము అణుశక్తినుండి సృష్టింపబడినది. అణువు నుండి అణువును విడగొట్టినచో అది నాశనమగును. విశ్వము అణుశక్తినుండి పుట్టి, అణుశక్తిలోనే తిరిగి లీనమగుచున్నది. ఇదే యిపుడు మానవునికి హస్తగతమైన శక్తి.

మానవుడు ఆకాశములోనికి ఉపగ్రహములను పంప గలిగినాడు. మన మికమీదట అంతర్జాతీయ సమస్యలతో తృప్తిపడియుండలేమని దీని యర్థము; అంతర్గోళ సమస్యలతో మనము తలపడవలసియుండును. మనష్యుడు మనస్సుచే కట్టువడి పోయినచో, ఇదంతయు ఎట్లు సాధ్యమగును?

నాకొకనిపై ప్రేమ, ఒకని యెడల అసహ్యత కలవు; ముగ్గురమును కలసి ఒక నదీప్రవాహములో కొట్టుకొనిపోవుచున్నామనుకొనుము. మాకీదుట చేతకాదు; ముగ్గురమును మునిగిపోదుము. ఈ పరిస్థితిలో మన ప్రేమలు, అప్రేమలు ఏమియు ఉపకరింపవు. అణుశక్తి మానవునికి హస్తగతమగుటచే, ఇప్పుడ దే స్థితి సంభవించినది. ఈశ్వరునియెత్తునకు మానవుడు పెరిగినాడు. ఈశ్వరునివలెనే అతడుకూడ సృష్టింపగలడు, నాశమొందింపగలడు. అతడొక చిన్న దేవుడైనాడు. కాని దేవునిలో మనస్సుయొక్క ప్రభావము శూన్యము. అతడు మనోతలమును దాటినవాడు. మమకారములకు, అసూయలకు అతీతుడు. భగవంతుని యెత్తునకు లేచిన తరువాత గూడ, మానవుడు మనస్సునకు వశుడైయున్నచో కలుగు పర్యవసానము వినాశకరము. మనుష్యునివలె భగవంతుడు కూడ మనోశక్తికి లోబడినచో ఏమయియుండెడిదో ఊహింపుడు. అట్లే మనుష్యునిలో గాడిదప్రవృత్తి పనిచేసినచో ఏమయియుండును? మనుష్యునిలో మనస్సు గాడిదలో ప్రాణము ప్రధానములగుటచే ఫలితము సంపూర్ణ విరసమే.

ఈనాడు మానవుని భావోద్రేకములు అపాయకరము లగు ఫలితములను దెచ్చుచున్నవి. పూర్వమందైనచో మన వ్యవహారములు ముఖాముఖిని ద్వంద్వయుద్ధముతో పరిష్కార మయ్యెడివి. కాని ఈనాడు బుల్గానిన్, ఐసెన్ హోవరులు శత్రువులైనచో ఎదుటబడి కుస్తీపట్లు పట్టరు, అణ్వాస్త్రముల నుపయోగింతురు. అయితే దాని పర్యవసాన మేమి?

కనుక మానవుడు మానసికమమకారములను, అసూయ లను వదలించుకొన్నచో మాత్రమే, తనచేతికి వచ్చిన ఈశక్తిని సద్వినియోగమునకు తేగలుగును. పూర్వకాలపు మనస్తత్వ శాస్త్రములను వ్యర్థపరుచుటయే ఇప్పటి మానవ సమస్య. ప్రాచీన ధర్మశాస్త్రములకును, పాఠ్యపుస్తకములకును మరొక నూతనాధ్యాయమును చేర్చినమాత్రాన ప్రయోజనముండదు. తగులబెట్టుటకే అవి పనికివచ్చును.

విజ్ఞానముయొక్క అంతస్థు మనోతలమునకు పైది. ఆ యెత్తున కధిరోహించునట్లు విజ్ఞానము మనల నొత్తిడి చేయు చున్నది. విజ్ఞానముయొక్క యునికి ప్రాణ మనోతలముల కంటె యున్నతమైనదని ఉపనిషత్కారు లెరిగియుండిరి. కాని యాకాలమున నది వ్యక్తిగత సాధన మాత్రముగ నుండెను. కొద్దిమందివ్యక్తులు యత్నించి ఆయెత్తునకు లేచుటయే ఆ కా లమునకు సరిపోయెను. మిగతవారు వెనుక బడినను నష్టము లేదు. అందరును విజ్ఞానోన్నతిని పొందవలెనని అప్పటిపరిస్థి తులు ఒత్తిడిచేయలేదు. మనస్సు నతీతించితీరవలసిన స్థితికి ఈనాటి విజ్ఞానము మనలను తెచ్చినది. ఆధ్యాత్మిక సాధన

వలన మాత్రమే ఈపని నేరవేరగలదు. కనుక ఆధ్యాత్మిక పర్యాలోచనకు పూనుకొనునట్లుగ విజ్ఞానము మనలను నిర్బంధించుచున్నది. ప్రాచీన ఋషులు వ్యక్తిగత ఆధ్యాత్మిక సాధనల నవలంబించిరి. ఆసాధనకే ఇపుడు సామూహిక రూపము నీయవలసినదిగ విజ్ఞానము కోరుచున్నది. ఎందులకనగా, అట్లయితేనే విజ్ఞానము మానవజాతి కుపయోగపడగలదు. లేనిచో మనకు సర్వనాశము తప్పదు.

ప్రాచీన ఋషులు 'నేను' 'నాది' యనుభావమును వదలిరి. "ఈయిల్లు, పొలము, చివరకీశరీరము—ఏదియు నాది కాదు" అని వేదాంతము బోధించెను. విజ్ఞానము యొక్క అంతస్థుకు మనము చేరినపుడు ఇట్లే "ఈయిల్లు, యీయాస్తి, ఈ పొలము ఇవి యన్నియు మనయందరివి" అని యనవలసియుండును. విజ్ఞానయుగమున ఇట్లనక తప్పదు. మనకున్న మార్గములు రెండు: సామూహిక, ఆధ్యాత్మికసాధనకైన పూనుకొనవలె, లేదా నశించిపోవలె. ఆధ్యాత్మిక సాధనచేసి స్వర్గరాజ్యము నీపృథ్విపై ప్రతిష్ఠించవలె లేనిచో ప్రపంచముతో సహా సమసి పోవలె.

'మనోతీత స్థితి' యనునది తత్వశాస్త్ర పరిభాష. కాని మన మిప్పుడు దానిని మరింత ఆచరణ యోగ్యముగ జేసి, నిత్యజీవిత కార్యములందు దాని ప్రయోజనమును కనుగొనవలెను. గురు శిష్యుల పరిశోధనాలయములలోను, కృషీవలులు వ్యాపారస్థులు, పాలకులు, పాలితులు మొదలగువారి నిత్యజీవితములలోను దాని ప్రయోజనమును కనిపెట్టవలెను. ఈ

నూతన దృష్టితో చూచినచో, మన పూరాతన పాశ్యగ్రంథములు, సారస్వత గ్రంథములు పనికిమాలిన వగును. ఆసారస్వతమేదియు ఇపుడు పనికిరాదు. అది నిమ్న శ్రేణికి చెందినది. నూతన సారస్వతము సృష్టింప బడవలెను. పాతమతములు కూడ పనిచేయవు. విగ్రహముల యెదుట ధూపదీప నైవేద్యముల నుంచి భగవంతుని సంతోషపరచుట కుదరదు. ఈమానవజాతి భగవంతుని సజీవమైన ప్రతి రూపమై యున్నది. మన మారాధింప వలసినది ఈ ప్రతిమను. మానవ కోటికి కంతకును చాలినంత తిండి యున్నదాయని మనము విచారించవలెను. మానవ సమాజమునే దైవముగ ఆరాధించు నాటకమిది. ప్రారంభ దశలో నిదియొక నాట్యరంగముగ కాన్పించునే కాని, కొంత కాలమునకిది సత్యానుభూతిగ మారును.

గ్రామదాన నాటకమును మనము ప్రారంభించినాము. దానమీయఃబడిన గ్రామములు మమత్వమును విడిచి పెట్టినవాయని, గ్రామములోని బిడ్డల నందరిని స్వంతబిడ్డలవలె చూచుకొనగల స్వార్థరాహిత్యము వారి కబ్బినదా యని కొందరడుగు చుందురు. ఒక్క రోజులో ఇదంతయు ఎట్లు సంభవమగునని నేను బదులు చెప్పుదును. గ్రామదానమును సాధించిరనగా ఒకనాటకమును తయారు చేసిరని యర్థము. ఈయుగమున కీనాటకము అత్యావశ్యకమని విజ్ఞానముతలచుచున్నది. విజ్ఞానమే మరల ఈనాట్యరంగమును సత్యానుభవముగ మార్చును.

ధార్వార్
31—1—'58



# 13. ప్రకృతిని జయించుట

ఈ యుదయమున నొక విద్యార్థి నన్నొక రసవంత మగు ప్రశ్న నడిగెను: "నిజముగ మనకున్న స్వేచ్ఛ యెంత? బాహ్యపరిస్థితులపై మనకేమైన బలమైన అధికారమున్నదా? బాహ్యస్థితిగతులకు మనము బానిసలమే నైనచో, మనకు మిగిలిన స్వేచ్ఛయెంత?" అని ప్రశ్న.

ఇది చాల పాతప్రశ్న. కాని మన మీప్రశ్నను వ్యక్తి దృక్కోణము నుండి గాక సామూహిక దృష్టితో చూతము. ఎందుచేతననగా మన సంకల్పములను వ్యక్తిగతముగ గాక సామాజికముగ చేసికొనుటవలన బాహ్య ప్రపంచముపై మన మెక్కువ అధికారము సంపాదించగలము. మన మిపుడు చేయు చున్న పనియేమి? ఒకలక్ష్యమును పెట్టుకొని నామట్టుకు నేనే దానిని చేరుటకు కృషి సల్పుచుందును. నా యిరుగు పొరుగు వారికి నాకృషియెడల సుముఖత్వముండక పోవచ్చును. బాహ్య పరిస్థితులుకూడ నాకనుకూలించక పోవచ్చును. తోడి మానవుల యాశయములు నాకు వ్యతిరేకములై యుండవచ్చును. అట్టిచో నేనొంటరిగ నాతోడి వారిని, బాహ్యపరిస్థితులను, అన్నిటిపైన భౌతిక ప్రపంచమును ఎదిర్చి పోరాడవలెను. ఇట్లొకేసారి రెండు మూడు ముఖముల పోరు సల్పవలెను. మరి యిట్లే ప్రతివ్యక్తియు స్వతంత్రముగ తీర్మానములు చేసి కొను స్వేచ్ఛ కలిగియున్నాడు. మాయాశయములు పరస్పర విరుద్ధము లైనచో మామధ్య పోరాటము తప్పదు. ఇట్టిస్థితిలో

ప్రపంచముపై ఆధిపత్యము సంపాదించుట చాలకష్టము. సుమారుగ నిదియే మానవుని ప్రస్తుత స్థితి.

విజ్ఞాన శక్తి వ్యక్తి ప్రయత్నములకు అనుకూలముగ నుండబోదు. అందరొక నిశ్చయము చేసికొని సమిష్టి కార్య సాధనకు గడంగినపుడే, విజ్ఞానము యొక్క సహకారముండును. అప్పుడు ప్రపంచముపై ఆధిపత్యము పొందుట సులభము. మానవు లొకరి కొకరు సాయపడుటయు సులువగును. పోరాటము లంతరించును. అపుడు ప్రకృతిపై ఆధిపత్యము కొరకు అందర మేకమై పోరాడుదుము. విజ్ఞానము మన విజయమునకు తోడ్పడును. పరిస్థితులకు బానిస నైతినని చెప్పి మానవుడటుపైన బాధపడ నక్కర లేదు బాహ్య ప్రపంచమును జయించ గల ధైర్యము చిక్కులకు విజ్ఞానముయొక్క సహాయము కావలెను. ఇందులకై సమిష్టి లక్ష్యమును పెట్టుకొని దానిని చేరుటకు సామూహికముగ తీవ్ర కృషిసల్పవలెను. ఇపుడు సామూహిక మనుమాటకు యావత్ మానవ సమాజమను అర్థము వచ్చినది. ఇట్టిసామూహిక లక్ష్యమును సాధించుటకు యావచ్ఛక్తిని వినియోగించుట ప్రతి వ్యక్తికి ధర్మమగును. సార్వజనిక కార్యసాధనలో తాను భాగస్వామియను తృప్తి అతని కుండును. విజ్ఞాన శక్తి మనకిపుడు చేపడియున్నది; దిన దినాభివృద్ధి నొందుచున్నది. భవిష్యత్తులో ఇంతకుమించి కూడ దాని సహాయము మనకుండగలదు. కనుక ఆశక్తిని మనము విరివిగ నుపయోగించు కొనవలెను. విజ్ఞానమును ఉపయోగ పరచుకొన్నచో మనము ప్రకృతిని జయింపగలము. "మనము

నిజముగ స్వతంత్రులమా ? బాహ్యాపరిస్థితులపై మనకేమైన అధికారమున్నదా ?"- ఇత్యాది ప్రశ్నల కటుపైన తావుం డదు.

విజ్ఞానము నిరంతరాభివృద్ధి నొందవలెనని, మారణాస్త్రములను కనిపెట్టుటలోను, నిర్మించుటలోను తాము సహాకరింప బోమని చెప్పి విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఒట్టు పెట్టుకొనవలెనని ఇటీవల నేను చెప్పి యుంటిని. దిన వార్తా పత్రికలు నా మాటకు మాన్యత నిచ్చుచు 'ఈ సర్వోదయ వాదులు కూడ విజ్ఞానము యొక్క విలువను గుర్తించుట శుభసూచకమే' యన్నవి. సర్వోదయవాదులు తాతలనాటి పాతభావములతో ముడి పెట్టుకొని కూర్చుందురనియు, విజ్ఞానాభివృద్ధికి వారు వ్యతిరేకులనియు అనుట వాడుకయైనది. మరియొక వైపున సర్వోదయమునంగీకరింపక విభిన్న సంప్రదాయములకు చెందిన హేమా హేమీ తార్కికులు విజ్ఞానాభ్యుదయాభిమానులుగ చెల్లుబడి యగుచున్నారు. దీనిని మించిన పెద్దపొరపాటు; అపోహ మరిలేదు. విజ్ఞానమును విరివిగ నుపయోగ పరచుకొనుటకు పూర్ణార్హతకలవాడు నిజముగ సర్వోదయ విశ్వాసియే. సర్వోదయము నందు నమ్మకము లేని వానికి, అనగా సర్వమానవ కళ్యాణమును హృదయ మందిడు కొనని వానికి విజ్ఞానశక్తుల నుపయోగించుకొను యోగ్యతలేదు. ఎందులకనగా, అట్టివాని యాధీనమునందున్న విజ్ఞానము మానవజాతి యొక్క పూర్ణాహుతికే కారణమగును. కనుక సంపూర్ణ విశ్వాసముతో అహింసను స్వీకరించినవాడే విస్తారముగను, హృదయ పూర్వకముగను విజ్ఞానమునకు స్వాగత మీయగ

లదు. ప్రపంచమున మరెవ్వడును ఆ పని చేయ లేదు. కనుక నే ప్రజలు సర్వోదయమును స్వీకరించి విజ్ఞాన సంపాదనకు పూను కొన్న చో, అది మానవసేవకు సహాయకారిగను, రక్షణోపా యముగను, దివ్యశక్తిగను పనిచేయును.

సాంఘిక వ్యవస్థ యొక్క రూపము పూర్వసంప్ర దాయ సిద్ధముగనే నిలిచి యుండిన బాగుండునని, వస్తూత్పత్తి విషయమున ప్రాచీన పద్ధతులే మంచివని, నవీన యంత్ర వ్యామోహమున బడుట అపాయకరమని అభిప్రాయపడువారు కొందరు సర్వోదయోద్యమము నందున్నారని కూడ నే నెరుగు దును. అయితే విజ్ఞానమును, యంత్ర పారిశ్రామిక విధాన మును ఒకటికావు. ఎట్టి సాంఘిక వ్యవస్థలో ఎట్టి యంత్రోప కరణము లుండవలెనో నిర్ధారణ చేయునది విజ్ఞానముకాదు. ఆయా ప్రాంతీయ సాంఘికస్థితి, జనసంఖ్యా సమస్య, భూమి— రైతునిష్పత్తి, ప్రజలకు వృత్తిని కల్పించుటకుగల అవకాశ ములు మొదలగు వానిని పర్యాలోచన చేసిన మీాదటనే ఆ నిర్ధారణ కావలెను. అట్టిచో, ఎట్టి యంత్ర సామగ్రి నుపయో గించు కొనవలెనన్న దానిపై వివిధ దేశములు వివిధ తీర్మాన ములు చేసికొన వలసి యుండును. ఈతీర్మానములు కాలభేద మును బట్టి కూడ వివిధరీతులు మారుచుండును. ఈ నాడొక రకపు యంత్రము యెడల మనము సహనము చూపవలసి వచ్చును, మరునాడు చూపక పోవచ్చును. ఈ నాడు కోరుకొని స్వాగత మిచ్చు యంత్రములకు కాలాంతరమున పూర్తిగ ఉద్వాసన చెప్పవచ్చును. అన్ని దేశములలో నిట్లే జరుగ

వచ్చును. ఎప్పుడెట్టి పారిశ్రామిక పరికరము లవసరమో అప్పటి కవి నిర్ధారణ యగుచుండును. అంతేకాని, ఈ విషయ మున నెట్టి మొండి పట్టుదలలకును తావుండరాదు. పారిశ్రా మిక పద్ధతులతోను, పరికరముల తోను, విజ్ఞానమున కెట్టిసం బంధమునులేదు. పెద్దయంత్రములలో నెంత విజ్ఞానమున్నదో చిన్న వానిలోను అంతే యుండగలదు. కనుక సర్వోదయము బాహాటముగ విజ్ఞానమునకు సంపూర్ణ స్వాగతమిచ్చునను విష యమును మనము గుర్తింతము.

ఈనాడు విజ్ఞాన ప్రాముఖ్యమునుగూర్చి నావలె నింత గట్టిగ నొక్కి చెప్పువారు బహుకొలది మంది. విజ్ఞానమును అభిమానించువారు పలుపుకున్న మాట నిజమే. కాని ఆత్మ జ్ఞానమును నిర్లక్ష్యముచేసి ముందుకు నెట్టుకొని పోవుటయే వారిపని. దీనివలన కలుగు ఫలితములు భయావహములు. సర్వోదయము యొక్క నడక ఆత్మజ్ఞానముపై దృఢముగ నాధారపడి యున్నది. కనుక విజ్ఞానమనిన దాని కేమాత్రపు భయమును లేకపోగా, నిండు హృదయముతో నది విజ్ఞానము నకు స్వాగత మిచ్చుచు, దానిని చక్కగా నుపయోగించు కొనగలదు.

సర్వోదయములోని ముఖ్య విషయమిది: ఆత్మ యెన్న డును దాస్యశృంఖలములలో బడి సంకుచితము కానేరదు. అది సర్వవ్యాపకము. ఇందు చేతనే మన నిశ్చయములు సామూహికములై యుండవలె. ఈసమిష్టి సంకల్పములతో విజ్ఞానమును జోడించితిమేని బాహ్యపరిస్థితులను వశపరచుకొన

గలము. సంపూర్ణాధిపత్యమును సాధింతుమని చెప్ప సాహసిం పలేము. కాని కొంతవరకు విజయము తప్పదు.

ఈ ప్రపంచసృష్టికర్త తన సంతానమునకు దుఃఖమయ జీవితమును విధించుట అసంభవము. మన సౌఖ్యమునకు వలసిన దంతయు అతడిచ్చినాడు. కాని మన సాహసకృత్యములతో ఆ సుఖమును దుఃఖముగ మార్చివేసికొన్నాము. అతడు ద్రాక్ష పండ్ల నీయగా, వానిని సారాయిగా మార్చుచున్నాము. ఇనుమును దయచేసినాడు; దానితో ఆయుధములను చేయుచు న్నాము. ఆవు మనకు పాలను, పేడను కూడ యిచ్చుచున్నది. కాని పేడతో గోడలకు పూతపెట్టుటకు మారుగా, దాని నాహారముగ నుపయోగించి, పాలతో గోడలకు వెల్లవేసి నచో అది ఆవు తప్పుకాదు. సరిగా బ్రతుకుట మనకు తెలి యక పోయినది. కనుక మన జీవితములను దుఃఖభాజనము లుగ జేసికొన్నాము

నేనొక ప్రతిపాదనను మీముందు పెట్టుచున్నాను: మన కున్న దేదో అది సంఘమంతకును చెందవలసిన దని తలప వలెను. ఇతరుల కిచ్చిన మీదటనే మనము దాని ననుభవిం చవలెను. ఇది తప్పనిసరి. ఈ విజ్ఞానయుగమున మనకిది మహో పకారి. ఇతరులకు పంచిపెట్టిన మీదటనే తాననుభవింప వలె నను భావన యుగాంతరముల నుండి మనకు అందీయబడుచు వచ్చినది. కాని ఈ విజ్ఞాన యుగమున వ్యక్తికాని, సంఘము కాని దానిని కాదని మనలేరు. ఇందుచే సామూహిక సాధనను సామూహిక సుఖానుభవమును గూర్చిన ఈ భావనను నేను

మిూముంగిడుచున్నాడు. విజ్ఞానయుగములో ఇదొక్క ప్రేమనకు సుఖము నీయ గలిగినది.



## 14. లియోసే, స్టాలిన్.

వివిధ పక్షములకు చెందిన అఖిలభారత నాయకులు ఎల్ వాల్ లో జరిగిన గ్రామదాన * సమావేశమునకు హాజరయిరి. గ్రామదానోద్యమము నభినందించుచు వారొక సమిష్టి ప్రకటన చేసియుండిరి. ఆప్రకటనలో భావగర్భితములగు రెండు పదములను వారుపయోగించిరి. సాంఘిక సమస్యల పరిష్కారమునకు వినోబా అవలంబించిన అహింసాయుత సహకార పద్ధతుల ప్రాశస్త్యమును వారు శ్లాఘించిరి. మన యుద్యమములో వారు రెండు ముఖ్య విషయములను గమనించిరి : మొదటిది ప్రాచీన ఋషులొసగిన అహింసావరము, రెండవది నవీనవరమగు సహకార పద్ధతి.

వారి వాఙ్మూలము యొక్క ప్రాముఖ్యమేమో చూతము. అహింస, సహకారములు రెండును గ్రామదానములో కలసి యున్నవి. ఆత్మయొక్క యేకత్వానుభూతిని ఆధారముగా గొన్న ఆధ్యాత్మిక భావన నుండి బయలుదేరినది అహింసా విధానము. విజ్ఞాన మార్గమున చేయబడిన ప్రయోగముల యొక్కయు, అందలి యనుభవముల

* మైసూరులోని ఎల్ వాల్ లో 1957 సెప్టెంబరులో జరిగిన ఈ సమావేశమునకు కాంగ్రెస్, ప్రజాసోషలిస్టు, కమ్యూనిస్టు నాయకులు హాజరైరి.

యొక్కయు ఫలితము సహకార విధానము. సర్వోదయమున నీరెండును కలసినవి. ఇందుచేతనే ఇది నాయకులకు అంగీకృతమైనది.

సర్వోదయము ఆధ్యాత్మిక, వైజ్ఞానిక విధానముల సమ్మేళనముయొక్క పరిణామమని మొదటి నుండియు చెప్పుచుంటిని. "ఈ సర్వోదయమువారు కేవలము మితవాదులు, అభివృద్ధి నిరోధకులు; ప్రకృతి పరిశోధన యొక్క విలువను గుర్తింపనేరరు" అని కొందరనుకొనెడు వారు. బట్టల మిల్లు కంటె చరఖాను, చరఖాకంటె తకిలీని, అందును ఉక్కు తకిలీకంటె నెదురుపుల్లతకిలీని వారభిమానింతురని, తకిలీని కూడ వదలి చేతివ్రేళ్ళతోనే నూలు వడకనిచ్చగింతురేమోయని సర్వోదయవాదులను గూర్చి వారి భావన. కాని సర్వోదయమున విజ్ఞానము కూడ కలసి యున్నదని వారిపుడు తెలిసికొనుచున్నారు.

అహింసాత్మకమగు మన సాంఘిక కార్యక్రమమును విజ్ఞానముతో పనిలేని కేవలాధ్యాత్మిక తత్వముపై నడిపినచో నేమగును? ప్రాచీన చైనాదేశపు ఋషి 'లియోసే' ఆదర్శప్రాయమగు నొకగ్రామ జీవిత ప్రణాళికను ఊహచేసెను. ప్రతి గ్రామము సంపూర్ణ స్వయంపోషక శక్తిని కలిగియుండవలెనని, గ్రామ ప్రజలందరు తృప్తితో బ్రతకవలెనని అతని యుద్దేశము. ఎవరును తమ గ్రామము దాటి బయటికి పోనక్కర లేదు; మిగత ప్రపంచముతో నెట్టి సంబంధమును పెట్టుకొనబనిలేదు. రాత్రివేళ దూరము నుండి శునకముల మొరు

గుడు వినబడి నపుడు మరికొన్ని యితర గ్రామము లున్న వని వారూహించు కొనవలె. విజ్ఞాన రహితమగు ఆధ్యాత్మిక పద్ధతులపై నడుపబడు అహింసా ప్రణాళికయొక్క రూపమిది. ఒక గ్రామముతో మరియొక దానికి మైత్రియు లేదు, శత్రుత్వ మును లేదు. రెంటి సంబంధము పూర్తిగ తెగిపోయి నట్లే. సర్వోదయమనగా నొకవిధమగు లియోసే ప్రణాళిక వంటిదను అపోహలో మన రాజకీయ నాయకు లుండిరి.

ఇక, ఆధ్యాత్మికముతో పనిలేని వైజ్ఞానిక ప్రణాళిక కుదాహరణముగ సోవియటురష్యాను తీసికొందము. అక్కడ ప్రతి విషయమును కొలది మంది నిరంకుశ నియంతలచే పై నుండి నియామకమగును. ఏ విషయమున గాని ప్రజాభిప్రాయ మును కనుగొన వలెననుతలపే యుండదు. సేద్య విషయమును గూర్చి మన దుక్కిటెద్దుల అభిప్రాయము మన కెంత అవసర మనుకొందుమో ఇదియునంతే. దినమున కిన్ని గంటలచొప్పున పనిచేయుట మాత్రమే, ఎద్దులకు విధి. వాటికి మంచి మేత, మంచి నివాసము చూపుటతో పొలముకాపు బాధ్యత తీరినది. ఇందు శరీర సుఖమున కేలోపమును లేకపోవచ్చును. కాని వాక్ స్వాతంత్ర్యము సున్న.

ప్రాచీనుడు లియో[illegible]వీనుడు స్టాలిన్—ఇరువురి ప్రణాళికలను మీ యెదుట నుంచితిని. లియోసే యొక్క అహింసయు, స్టాలిన్ యొక్క విజ్ఞానయుత రాజ్యనిర్వాహక నిపుణతయు—ఈ రెంటి కలయిక సర్వోదయమున మనకున్నది.

25—9—'57

